# విషయసూచిక.



## రెండవ భాగము,

## VI. భీష్మ పర్వము.



## VII. ద్రోణ పర్వము.



## VIII. కర్ణ పర్వము.

## IX శల్య పర్వము.



## X. సౌప్తిక పర్వము.

## XI. స్త్రీ పర్వము.



## XII. శాంతి పర్వము.

## XIII. అనుశాసనిక పర్వము.



## XIV. ఆశ్వమేధ పర్వము.



## XV. ఆశ్రమ వాసపర్వము.

## XVI మౌసల పర్వము.



## XVII. మహాప్రస్థానిక పర్వము.



## XVIII. స్వర్గారోహణ పర్వము.

శ్రీ

శుభమస్తు.

# బాలభారతము.

## రెండవభాగము.

## VI. భీష్మపర్వము.

---

### (1) సంజయుఁడు ధృతరాష్ట్రునకు భారత యుద్ధారంభ ప్రకార మెఱింగించుట.

వైశంపాయనుఁడు జనమేజయున కిట్లనియె. "అట్లు రెండు సేనలును గురుక్షేత్రంబునం గూడి కయ్యమునకుఁ గాలు ద్రవ్వుచుండ, నట హస్తిపురిలో ధృతరాష్ట్రునొద్దకు వ్యాసమహర్షి యే తెంచి, లోకములోని భూపాలురకుఁ గాలం బగుటచే నాలంబు సంభవించిన దానికి దుఃఖింపవల దని చెప్పి, యతనికి యుద్ధప్రకార మంతయు సవిస్తరంబుగాఁ దెలుప సంజయుని నియమించి, యా సూతనందనునకు శీఘ్రగమనమును, రణాంగమున సంచరించునపుడు శస్త్రాస్త్రములవలన భయంబు లేమియు యోధవరులయొక్కయు దివ్యులయొక్కయు రహస్యవర్తనలు, భాషణములు, మనోభిప్రాయములు నెఱుఁగు శక్తియుఁ బ్రసాదించి చనియెను

సంజయుఁ డంత నారాజునకు భూపరిమాణంబు దెల్పి, యందు మలయాది సప్తకులపర్వతములచే శోభిల్లునదియు, విశేష

ధనార్జనమునకు మూలమైన చిన్న గొప్పనదులును మహారణ్య ప్రదేశములును, వివిధ ఖనివర్గములును జనపదసమూహము లును గల్గి, పాడిదప్పక యేలువారికిఁ గామధేనువు వంటిదియున్నై తనరారు భారతవర్షముయొక్క మహిమ నెఱింగించి, యెంత భూములున్నను జాలుననక పరదేశంబులం గొని యేలు నాసచే రాజులు చుట్టఱికము విచారింపక తమలోఁ బోరుట సహజము గావునఁ బాండవకౌరవు లట్లు ఘోరముగా భారతవర్ష పరిపా లనోత్కర్షులై యుద్ధంబునం బెనంగ మొనసినందులకు వగవ కుండునట్లు చెప్పి, రణభూమికి వెడలెను. కొన్నిదినంబు లేఁగిన తర్వాత సంజయుఁడు మగిడి ధృతరాష్ట్రునొద్దకు వచ్చి. యుద్ధ ప్రకార మెఱింగించువాఁడై దేవవందితుఁడైన పారాశర్యముని పుంగవునకు నమస్కరించి, రాజుతో నిట్లనియె.

"రాజేంద్రా! వినుము. రెండు సేనలును సమరోల్లాసంబు సంధిల్ల నడచి, కురుక్షేత్రమునం దుత్తమప్రదేశంబైన శమంత పంచకమను ప్రదేశమునకు సమీపముగాఁ జేరి పోరునకుఁ గడం గుచుండుటను జూచి, రెండు సముద్రములు మేర దప్పి యుబ్బి యొండొంటఁ గప్ప నెదిరించుచాడ్పున నుండెను. కౌరవసేనలో ననేక దుర్నిమిత్తములు పుట్టెను. పాండవులకు జయసూచక ముగా సుగంధ మిళితవాయువులు మృదుమనోహర ప్రకారం బులై వీచెను. భీష్ముఁడును ధర్మరాజును దమతమ యోధుల కెల్ల నుత్సాహకరములైన వాక్యము లాడిరి. అందఱును బవర మున గెల్చి పుడమి గొనుట యొండెఁ జచ్చి పుణ్యలోకములు వడయుటొండె, నని తమలో నిశ్చయించుకొని ధీరులై ప్రతి జ్ఞలు సేసి శంఖంబులు పూరించిరి.

అప్పుడు ధర్మరాజు పాదచారియై భీష్మద్రోణకృపశల్యులకడకు వచ్చి, వారలకు నమస్కరించి: యుద్ధములోఁ దనకు జయము గలుగునట్లు చేయవలయు నని ప్రార్థించెను. భీష్ముఁడు తన చేతిలో విల్లుండువఱకుఁ దన్ను గెల్వఁబోలదనియెను. ద్రోణుఁడు తాను వినరానియట్టి చేటుమాట మిక్కిలి నమ్మఁదగినవానిచే వినినప్పు డస్త్రసన్న్యసము సేయఁగలవాఁడననియు, నప్పుడే తన్ను వధింపఁబోలు ననియుఁ బలికెను కృపుఁడు తా నవధ్యుఁడగుట యెఱింగించి ధర్మరాజును జయముగొనునట్లు దీవించెను. శల్యుఁడు కర్ణునింగినిసిపలికి ప్రాణంబు లేకుఁ జేతులాడకుండునట్లు చేయఁగలవాఁడ ననియె. అంత ధర్మరాజు వారల వీడ్కొని నిజసైన్యముం గూడుకొనియెను. నీరోడు కుయుయుత్సుం డప్పుడు కౌరవుల విడిచి తనసైన్యములతోఁ బాండవులం గలిసెను.

అంత దుర్యోధనుఁడు భీష్మాభిరక్షితమైన నిజబలము కంటెను భీమాభిరక్షితమైన పాండవబలము దోర్బలమెక్కుడు పట్టుటకు వగచుచుండ, భీష్ముఁ డాతనికి నుబ్బుగల్గునట్లు శంఖను పూరించెను. తక్కిన దొరలును దమచిందముల ప్రమోయించిరి. పాండవసేనలోఁ గృష్ణార్జునులును, ధర్మతనయభీమాదిభూపతులును దమ శంఖంబు లొత్తిరి. అప్పెనుమ్రోఁత భూమ్యాకాశములునిండి కౌరవులహృదయములు భేదిల్లునట్లు చేసెను. అంత నాయుధము లేయఁదలఁచినప్పుడు, పార్థుఁడు రెండుసేనలలోనున్న బంధువులంజూచి కలంగి కృపాయత్తచిత్తుఁడై తాను యుద్ధముసేయ నొల్లకుండుటను సారథియగు వాసుదేవున కెఱింగించెను. ఆవేదాంత పురుషుఁ డతనికి నాత్మానాత్మవివేకప్రదంబులైన సుభాషితంబుల సందేహంబులు వాపుచు: రాజులకు సమరంబు సేయుట

కంటె నుత్తమమైన ధర్మకర్మము లేదనియు, నిజకులోచితకర్మము లువదలుట కీడనియు, వానిని ఫలాపేక్షలేక, యహంకారబుద్ధిని వదలి, యీశ్వరార్పణముగాఁ జేయుటయే జ్ఞానస్వరూపమనియు నెఱింగించి, పరమభక్తాగ్రేసరుండగు నప్పార్థునివలని వాత్సల్యాతిశయంబుచే నాతనికి నిజవిశ్వరూపంబుసూపి, యుద్ధమునకుఁ బురికొల్పి జయంబును, రాజ్యలక్ష్మియుఁ, గీర్తియును బడయునట్లు చెప్పెను. అర్జునుఁడా విశ్వేశ్వరునకు భక్తితో దండప్రణామంబు లాచరించి స్తుతించి, యతనితొల్లింటి సౌమ్యాకృతిని జూపవేఁడెను. అమ్మహాపురుషుఁ డట్లె మరల సారథియై తోఁచి, మఱియు నాకౌంతేయునకు భగవద్భక్తి యోగశ్రేష్ఠత్వంబు దెలిపి, యది సిద్ధింపఁజేయ మనుష్యులకు స్వకర్తావలంబనమే మార్గమని నిరూపించి పలుక, ఫల్గునుండు ధన్యుఁడై యంతకుముందు రథంబుపై నిడిన గాండీవమందుకొని యాహవోన్ముఖుఁడై వెలింగెను. రాజోత్తమా! వినుము నే నావేదవ్యాసమహామునిప్రసాదంబునఁ బురుషసింహులైన యాకేశవార్జునులసంవాదప్రకార మంతయు వింటిని. హరివిశ్వరూపంబును జూచితిని. దానిం దలంపఁ దలంప నామనంబులో నచ్చెరువును ముదంబును గల్గుచున్నది. వేయిమాటలేల?

తే. అధిప! యోగీశ్వరేశ్వరుండైన కృష్ణుఁ
డును, ధనుర్ధరవర్యుఁ డర్జునుఁడు నెచట
నిలిచి రచ్చట విజయంబు నీతి సిరియు
భూతి నిత్యంబు లగు నిది నాతలంపు.

## (2) భీష్ముని మొదటి యెనిమిదినాళ్లయుద్ధము.

రాజేంద్రా! "రెండుబలంబులును గూడినప్పు డెవ్వరుముం
దుగడంగిరి? పోరెట్లయ్యె? నాకునంతయు సవిస్తరంబుగాఁ దెల్పు"
మనియడిగిన ధృతరాష్ట్రునకు సంజయుఁడిట్లనియె "కౌరవేశ్వరా!
నీకొడుకును దుశ్శాసనుఁడును బురికొల్పఁ గౌరవబలములు భేరీ
మృదంగాదివాద్యధ్వనులు నిగుడఁ బాండవ సేనలపైఁ గవి
సెను భీ ముఁడు భీమగర్జనరవంబులు నింగిముట్టఁ గురువీరులపై
నసరిన, దుశ్శాసన దుర్ముఖ ప్రముఖ నిఖిలకురుకుమారు
లాతనిపై నొక్కుపెట్టునఁ గవిసి యనర్గళముగా మార్గణంబు
లేసిరి. అప్పుడు ధర్మరాజు పురికొల్ప ధృష్టద్యుమ్నుండును
ద్రౌపదేయులును సుభద్రాతనయుఁడును భీమునకుఁ దోడ్ప
డిరి. రెండుమొనలలోని మేటిమగలు పరస్పర జయకాంక్షులై
తమసేనలతో నెదిర్చి పోరాడునప్పటి తోలితాఁకునకు మన్నె
గసి మిన్నుఁ గప్పి పెంజీఁకటి యొనర్చెను. పదపడి యారజము
వారణమద జలధారలను, గుఱ్ఱములలాలా జలప్రవాహములను
విదళితనరగజ తురంగ శరీరోద్గతరుధిరనదీ పరంపరలను నణఁగి
పోవఁగా, నుభయపక్షంబులందును రథికులు దమతమ, సిడ
ములతోఁ బొలుచురథంబులపై వెలుఁగుట గానవచ్చిరి. శాం
తనవుఁడు తేజోమూర్తియై మాత్స్య చేది కేకయ పాంచాల
బలంబుల నుగ్గుసేసి పాండవులకు వెఱపు పుట్టించి, సూర్యుఁ డస్తా
ద్రిపై వెలుఁగునప్పుడు సమరంబు సాలించి, యత్యుత్సాహితు
లైన కౌరవులతోఁ దన నివాసమునకేఁగెను. పాండవులు విషణ్ణ
హృదయులై తమ స్కంధావారంబు సేరిరి. కృష్ణుఁడు వారికిఁ
దగిన ధైర్యోక్తులు సెప్పెను.

రెండవదినమునఁ బాండవులు క్రౌంచాకారముగా సేనలను మోహరించుకొని కౌరవుల నెదిర్చిరి. భీష్ముఁడా యుగ్రరమ సించి సేనలు చీకాకుపడునట్లు చేసెను. అర్జునుఁ డామిన్నేటి కొడుకు నెదిరించి వియచ్చరులు మెచ్చఁబోరుసలిపెను. ధృష్టద్యుమ్నుఁడు ద్రోణాచార్యుల మార్కొనియెను. భీముఁడు కళింగపతి సైన్యముల దైన్యమునొందించెను. కృష్ణసారథ్యముననొప్పు క్రీడి కౌరవసేనలో నంభోనిధిం దిరుగు మత్స్యంబుమాడ్కి విహరించి పగతుఱు వెఱచి పఱవఁ గలకలుటమ్ము లేసిన, భీష్ముఁడు బవరము సాలించెను. అందఱుఁ దమ నివాసముల కరిగిరి.

మఱునాఁడు భీష్ముఁడు గరుడవ్యూహము దీర్చి యర్ధచంద్రాకృతి నమరియున్న పాండవసేనలతో సమరంబునకుఁ బూనెను. నాఁటియుద్ధములో రెండుపక్షములందును క్షత్రియవీరులు పలువురు మడిసిరి. పెక్కురథములు నుగ్గయ్యెను. ఏనుఁగులు పీనుంగులయ్యెను. రావుతులతో గుఱ్ఱములు దునిసిపడియెను. కుండలకేయూరాద్యాభరణములతో నొప్పువీరుల యంగకంబులతోఁ గూడిన సంగరభూమి చుక్కలచే వెలుంగు నింగివలెఁ దోఁచెను. దుర్యోధనుఁడప్పుడు గాఢ్పుపట్టితో దట్టయె వెనంగి యతని చే నేటువడి మూర్ఛిల్లెను. భీష్ముఁడు యుగాంతకాల కుపితసమవర్తిచందంబునఁ బాండవసేనలను బారిసమగుచున్న, నతని తాఁకున కోర్వలేక యద్దెసవీరులు విస్మితులై యూరకుండిరి. సేనలు పాఱఁజొచ్చెను. శ్రీకృష్ణుఁ డప్పుడు చక్రహస్తుఁడై భీష్మునిపైఁ గవిసెను. ఆ కౌరవవృద్ధుఁడా యాదవోత్తముం బొగడుచుండ, నర్జునుఁడు తేరు డిగి రయంబునఁ బఱచి యాపురుషోత్తముం బట్టుకొని,

ఉ. "కోపము సంహరింపు యదుకుంజర, పాండవకోటి కెల్లనుం
దేపవు గావె, నీ విటు లధీరతఁ బూనికి దప్పినం బ్రతి
జ్ఞాపరుఁడై నధర్మసుతు శౌర్యము ధైర్యము బాహువీర్యముం
రూపఱిపోక కాదె, యనుయాపమె నీకిది లోకనాయకా."

అని యాతనిం బ్రార్థించి మరల్చి తేరినొగ లెక్కఁజేసి దేవదత్తపాంచజన్య నినాదంబు లెసంగఁ గౌరవసైన్యముల నపహరించి. యగ్గిదూఁడంగాల్చువడువున మెఱుఁగుటమ్ములఁ జతురంగబలంబుల నేర్చెను. కౌరవు లాదినము చింతాక్రాంతులై మగిడిరి. పాండవసైనికవర్గము సంతోషంబునం బొదలుచు మరలెను.

నాల్గవనాఁటి కయ్యమునప్పుడు హిడింబాతనయుఁ డగు ఘటోత్కచుఁడు మాయ గావించి, కౌరవవ్యూహంబు గలంచి చిక్కువఱిచెను. పంచమషష్ఠ సప్తమదివసంబులందుఁ బాండవ కౌరవ సేనలు మకర శ్యేనమండల వజ్రాది బహువిధవ్యూహంబులుగా నమరి సమరంబునకుఁ గడంగిరి. ద్రోణభీష్మబాహ్లిక ప్రభృతులును గురుకుమారులును దమలావు సూపి పోరిరి. భీమార్జునులును, నభిమన్యుప్రభృతి కుమారులును, విరాటపాంచాల కేకయాదిభూపతులును, దమ మగంటిమి సూపి యని సేసిరి. రెండు సేనలయందును బలంబులు నుగ్గయ్యెను. ఎనిమిదవ దినమున భీష్మధృష్టద్యుమ్నులు నిజవాహినులఁ గూర్మ శృంగాటక వ్యూహములుగాఁ దీర్చి తలపడునట్లు చేసిరి. భీముఁ డాదినమున సునాభుఁడు మున్నగు నెనమండ్రు కురుకుమారుల తలలు నఱికి వైచెను. దుర్యోధనుఁడు దానిం గని సహింపనోపక, యశ్రులు రాల పితామహునిపాలికిం జని యిట్లనియె.

ఉ. "ఇమ్మెయిఁ గిట్టి వాయుసుతుఁ
డేపునఁ గోలుమసంగి పొంగి నా
తమ్ములఁ జంపఁగా నకట
తప్పక చూచెదు గాని రోషశో
కమ్ములు లేవు, తోడుపడఁ
గా దని నిల్చితో, యున్నవారు నో
కృ_మ్మడఁ జావఁ గోరి యిటు
లూరక యుండితో, కారవ్యో త్తమా."

భీష్ముఁడు నీకోనుకు ననునయించి "నేను ముందే నీకుఁ బాండవుల గెల్వరా దని చెప్పనా? భీముబారిం బడిన కురు కుమారుల చావు దప్పింప మన కలవి కాదు. నీవు గతమునకు వగనక మగతనం బూఁని యొండుదలాపులు విడిచి, నీకస్వర్గమే ధనముగాఁ బోరుము. నా యోపినంత నీకై పోరెదను. నీకు జయము గల్గనున్నచో దాని నేను దప్పించువాఁడనా?" యని పలికెను.

రాజేంద్రా! వినుము, దుర్యోధనున కిట్లు ధైర్యోక్తు లాడి పితామహుఁ డుగ్రముగా భీముపైఁ గవిసెను. వానికిఁ ద్రోడై ధృష్టద్యుమ్న శిఖండి సాత్యకులు విజృంభించిరి. దుర్యో ధను పనుపున ననేక రథికవరులు భీష్మునకు సహాయులై పాండ వవీరుల నెదిర్చిరి. అప్పుడు పార్థునికొడు కిరావంతుఁడు శకుని తమ్ము లార్వురు గాంధారకుమారుల తలలు నఱకుటను గురు పతిచూచి వగచి, మాయాయుద్ధ నిపుణుఁడైన యలంబుసుఁడను రాక్షసుని నియోగింప, నాతఁ డన్నాగకుమారుం గూల్చెను. తమ్ముని చావు గనుంగొని ఘటోత్కచుఁడు సహింపక క్రోధ

మూర్తియై రాక్షసబలంబులతో నడరి దుర్యోధనుని ససైన్యముగా భంగపఱిచెను. భీష్ముఁ డా హిడింబాతనయుని క్రొవ్వణఁగఁ జేయునట్లు ప్రాగ్జ్యోతిషాధిపతియగు భగదత్తుని నియమింప, వాఁడు సుప్రతీకమను నేనుంగు నెక్కి పాండవసేనాసాగరమున మందరనగంబుపోల్కి విహరించి, బలంబుల నెల్ల నేలకుం గోలకుం దెచ్చుచుండెను సవ్యసాచి సాత్యకిసహాయుఁడై భగదత్తుని నెదిర్చి యతని పోరారంభ ముడిపెను. అంతఁ బ్రొద్దు గ్రుంకిన నందఱును కయ్యము చాలించి తమతమ వీళ్లు సేరిరి.

## (3) తొమ్మిదవనాఁటి యుద్ధము; భీష్మునివిజృంభణము.

కురుపతి విషాదంబుతో శిబిరంబు సొచ్చి కర్ణ దుశ్శాసనులతో విచారించి భీష్ముని కయ్యమునకు రాకుండునట్లు చేయుట కార్య మని నిశ్చయించి యారాత్రి భీష్ముపాలికిఁ బోయి, చేతులు మొగిచి యతనితో నిట్లనియె.

చ. “అనిమొన దేవదానవుల కైనను మార్కొనరాదునిన్నుఁ, నేఁ
డెనిమిదినాళ్ళులయ్యె, సమయింపవు నొంపవు సవ్యసాచి, న
ప్పని యటులుండనిమ్ము, నినుఁ బ్రార్థనసేసెద నింతవట్టు నా
చనవునఁ బోవనిచ్చి నృపసత్తమ పోరికిఁ గర్ణుఁ బంపవే.”

వాలమ్ములం బోని యమ్మాటల కమ్మేటిమగఁడు నొచ్చుకొని దుర్యోధనున కిట్లనియె. “రాజా! నీకై నేను ప్రాణములు డాఁపక పోరుచుండ నడిరేయియందు వచ్చి నన్ను నొవ్వఁబలుకుటచే నీకు జయమగునా? ఖాండవము గాల్చి, యొక్కటికయ్యమున ముక్కంటిమెప్పించి,యొక్కట మమ్మందఱ

గెల్చి విరటుపసుల మరల్చిన యీ సవ్యసాచికి నెనయగుమగ వా రెవ్వరుగలరు? నీకప్పుడే చెప్పితిని; తగదని విచారింపక నీవు పాండుసుతులతో వైరము గొంటివి. రిక్తమాటలచేఁ దీఱునా? వినను రేపు నాయుద్ధమును జూడుము. గాండీవిశిఖండులఁ దక్క నొండుముగలం జెండాడెదను. నీవు విచారింపక పొమ్ము"

తాతపల్కులకు దుర్యోధనుఁడు ప్రియమంది యారాత్రి సుఖనిద్ర సేసి, మఱునాఁడుదయమున గయ్యమున కాయితమయ్యెను. రెండువాఁగులవీరులును దమచే నోపినంతవఱకు వెనుదీయక పోరుసల్పిరి. భీష్ముఁడు కృపాశ్వత్థామలతో నభిమన్యుసాత్యకుల మార్కొనియెను. ద్రోణుఁడర్జునుం దలపడెను. అలంబుసుఁ డభిమన్యుపైఁ గవిసెను. శల్యుఁడు యుధిష్ఠిరనకులసహదేవుల నెదిరించి చిక్కువఱచెను. సోదరులకు సహాయులుగా భీమపార్థులువచ్చి శల్యుం దాఁక, భీష్మద్రోణులు మద్రపతికిఁ దలకడచి వారితోఁ బోరాడిరి ప్రొద్దెక్కకొలఁది భీష్మభానుఁడు వేఁడిమిగిలి క్రూరనారాచకిరణములఁ బాండవవీరుల నొప్పించి, తత్సేనలం జీకాకువఱచెను. విష్వచ్చుఁడు మిన్నేటికొడుకు నదిర్చి యాతని బెట్టిదపుటంపఱచే నొచ్చి బడలిక చెందెను ఎవ్వరును భీష్మునకు ముందు నిల్వరైరి. నారాయణుఁ డప్పుడు తేరు దిగి రౌద్రముగా దేవవ్రతుమీఁదికి నడచెను. పార్థుఁ డాతని వెంట నుఱికి పట్టుకొని.

ఉ. "కయ్యము సేయ నే నని యకల్మషబుద్ధిఁ బ్రతిజ్ఞ సేసి, నీ
వియ్యెడఁ దప్పితేని జగ మేమను, నించుక సేపు పోరులే
డయ్యెటదప్పి? నాపయిఁ గడంగిన భీష్మునిపాటుసూతురా
వయ్య రథంబుమీఁది,కిటు లాశ్రితమానము వీటఁబుత్తురే".

అని యయ్యాదిమపూరుషుని వేఁడుకొని తేరెక్కించుకొనియె. భీష్ముఁడు కార్చిచ్చువలెఁ బేర్చి శరార్చుల వైరిసైన్యకాననం బేర్చుచుండ, సూర్యుఁ డస్తాద్రిం జేరెను. అందఱుఁ గయ్యము చాలించిరి. కౌరవులు భీష్మునిపరాక్రమంబు వొగడుచుఁ దమ నివాసముల కేఁగి సంతోషంబున నుండిరి.

(4) పదియవనాఁటి కయ్యము; భీష్ముఁడు శరతల్పగతుఁ డగుట.

రాజేంద్రా! ఆదినంబురాత్రి ధర్మరాజు కృష్ణునితోను సోదరులతోను రహస్యప్రకారముగా భీష్ముఁడున్నయెడకు వచ్చి యస్వీరోత్తముం గనుంగొని,

ఉ. "చిచ్చఱకన్ను మూసికొని చేతిత్రిశూలము డాఁచి లీలమై
వచ్చినరుద్రుచందమున వ్రాలుదు సీ పనిలోన, నోర్వఁగా
వచ్చునె నిన్ను నట్టిమగవారికి, నీకృప నాశ్రయింపఁగా
వచ్చితి, మెవ్విధిఁ గెలువ వచ్చుమహాత్మ యెఱుంగఁ జెప్పవే"

అని ప్రార్థించి యడుగ, గంగాపుత్రుఁడు కృష్ణసహాయులైన పాండవులకార్యము దీర్చుటకంటెఁ బురుషార్థ మొండుగల్ల నేరదని విచారించి, యంగనాపూర్వుఁడగు శిఖండిని మున్నిడుకొని కవ్వడి తనపై బాణంబులేసి పడవైచునట్లుగా, నాత్మవధోపాయంబు ధర్మరాజునకు నెఱింగించెను.

పాండవు లట్లే పదియవనాఁటికయ్యమున శిఖండిని ముందుగాఁ బెట్టుకొని తక్కిన వీరవర్యులతో నొక్కపెట్టున గంగాపట్టిపై నడరిరి. దుర్యోధనుఁడు చేయివీచి పురికొల్ప, నప్పితామహుని కడ్డముగా నశ్వత్థామ భూరిశ్రవసులును, దుశ్శాసనప్రభృతి కురుకుమారులును, కృతవర్మ కృపాచార్య కాంభోజు

లు మొదలగు రణవీరులును నేఁగుదెంచి తమతమ సైన్యములతోఁ బోరాడిరి.

“భీష్మంబొడివియేయుఁడు, తలఁకకుఁ” డను నెలుఁగులు పాండవబలములలోను, భీష్మునకడ్డపడుఁడు, తలకడవుఁడు, స్రుక్కకుఁ” డనుశబ్దములు గౌరవబలములోను నింగిముట్టుచుండ, నతిచలంబునం బెనంగునయ్యిరువాఁగుల పోరప్పుడు దేవదానవులపోరట్లు చూపఱకు వెక్కసపాటును గల్గించెను. భీష్ముఁడు శిఖండి నొక్కనిం దక్క నితరులనెల్ల వాలమ్ముల నొప్పించి, యెదిర్చిన సేనలఁ జెండాడి, విరటునితమ్ముఁడు శతానీకుఁ డెదురైన వాని తలం దునిమి, పాండవులకు విస్మయమును భీతియు నొక్కటఁ గల్గఁజేసెను. అంత నర్జునుఁడు శిఖండికి వెనుకయైయుండి తాతతోఁ బోరుచు, నాతనిచేతివిల్లు నొకపటుభల్లమునం ద్రుంచి, పిడుగులంబోని కఱకుటమ్ముల మొత్తమున నాతనిం గూలనేసెను. అప్పు డవ్వీరవర్యుఁడు తూర్పుతలగా, నొడలంతయు సందు లేకుండ నాటఁబడిన నరునియమ్ములచయమ్ములే పాన్పుగా వీరశయనంబు సేకొని, ప్రాణములు విడుచుటకుత్తరాయణము రాకకు వేచియుండెను. దేవత లాతనిపైఁ బుష్పవృష్టి గురిసిరి.

పాండవకౌరవులు పోరు చాలించి శరతల్పగతుఁడైన తాతం జుట్టుకొని విషాదముతో నుండిరి. అర్జునుఁ డాతనికి బాణములచేఁ దలగడయమర్చి, దాహము తీర్చుటకై నిజబాణశక్తిచే భూమిని భేదించి, దివ్యగంధముతోఁ గూడిన తియ్యని తెలినీరు తెప్పించి యిచ్చెను. దానికి భీష్ముఁడు సంతోషించి నరుంబొగడి, పాండవులకు భూమి పాలిచ్చి యున్న వారితోనైన బ్రదుకునట్లు దుర్యోధనునకు హిత ముపదేశించెను. అందఱును

మాటలాడక యూరకుండి యాతనికి మ్రొక్కి తమవిడిదలకుం జనిరి.

నాగేంద్రా! కర్ణుం డంత నా దేవవ్రతుం జూడవచ్చి యతనిపాదంబులకు శిరంబు సోఁక మ్రొక్కి,

ఆ. అలుక దక్కి నన్ను నధికవాత్సల్యశీ
తలముగాఁగఁ జూచి తగినమాట
లాడవే మహాత్మ యనుటయు నాతండు
గారవమున నతనిఁ జేరఁ బిలిచి.

కౌఁగిలించుకొని, యతఁడు రాధేయుండు గామియుఁ గౌంతేయుండే యగుటయు నెఱుంగుఁ గావున, నధికవాత్సల్యమున నాదరించి పలికి, పాండవులం గలియునట్లు చెప్పెను గాని, యాజమానసేవాతత్పరుఁడైన యాయహ్యాతిపుత్రుఁడు, దుర్యోధనునకై పాండుపుత్రులతోఁ బెనంగుటయే తన కింకఁ బోలు నని చెప్ప, నప్పలుక్కల కతఁడు సంతసించి, యట్లే చేయ ననుమతియిచ్చి వీడుకొల్పెను.

జనమేజయభూపతీ! ధృతరాష్ట్రుఁడు సంజయునిచేఁ దండ్రిపాటు విని శోకమూర్ఛితుఁడై కొంతవడికిఁ దేటి కన్నీరు డించుచు, "అకటా! తండ్రీ! నీచుఁడగు శిఖండిచే నీల్గితివే? ఇంక నాకొడుకులకు దిక్కెవ్వ?" రని బహుప్రకారములుగా విలపించెను.

ఇది భీష్మపర్వ కథాసంగ్రహము.

---

శ్రీ

శుభమస్తు.

# బాలభారతము.

## VII. ద్రోణపర్వము.

---

### (1) ద్రోణాచార్యుల మొదటి రెండునాళ్లయుద్ధము.

వైశంపాయనుఁడు జనమేజయున కిట్లనియె.

సూతపుత్త్రుండైన సంజయుఁడట్లు ధృతరాష్ట్రునకు భీష్ముఁడంపసెజ్జ సేరుట యెఱింగించి, మఱియు సంగరరంగమునకుఁ జని యందైదునాళ్లయుద్ధము గని, మగిడి ధృతరాష్ట్రునొద్దకు వచ్చి, యాదర్యుఁడైన ద్రోణుఁడు ధృష్టద్యుమ్నునిచేఁ గూలుటను దెలుప, నారాజు పరమశోకావిలుఁడై గద్గదకంఠముతో,

క. "అతిలోకపరాక్రమనిధి
మతిసురగురు మిగులఁ గురుకుమారగురుఁడు సు
వ్రతు లగుమత్సుతులకుఁ గా
మృతుఁడయ్యెఁ బరోపకారమృతి యొప్పఁగదా.

సంజయా! చీమలగుంపు పామును జంపినట్లు, పాండవరథికులు విక్రమధుర్యుండగు నాచార్యునెట్లు చంపఁగల్గిరి? మనవారాతని కడ్డపడరా? ప్రతాపధాముండగు నశ్వత్థామ తండ్రికిఁ దోడ్పడలేక యెందుగడఁ బోరుచుండెనా?" యని పలువిధ

ముల నుమ్మలించి వేయుడి గెను. ద్రోణునని తెలుంగు సెప్పువాఁడై సంజయుఁ డిట్లనిగాని.

"వినుము కౌరవేశ్వరా! భీష్ముఁడు శరతల్పగతుఁ డగు టకు శోకవార్ధిలో మునిఁగిన నీ కొడుకులకును సైన్యములకును నుబ్బుగా రాధేయుఁడు దీవిగతిం దోఁచి యందఱితో,

క. "కలఁగిన సేనలఁ గాచెద
నిలిపెద నర్జునునికడఁకఁ నెఱపెద బాహా
బల మాభీష్ముం డెట్ల
గ్గలిక మెఱసె నట్ల మీకుఁ గన్నులు దనియన్."

అని పలికి, ద్రోణునకు సర్వ సేనాధిపత్య మిచ్చునట్లు కురుపతికిఁ జెప్ప నతఁ డట్లే గురునకుఁ బట్టము గట్టెను. ఆచా ర్యుఁడు సంప్రీతుఁడై రారాజును వరమడుగునట్లు చెప్ప నాతఁడు దుశ్శాసనాదులతోఁ గూడుకొని, పాండవులం జంపినను గృష్ణుఁడు కౌరవుల తలలు నఱికి గొంతికే రాజ్యమిచ్చుననియు, ధర్మరాజు చిక్కిన నాతని మఱియు జూదమున నోడించి తమ్ములతోఁ గానల కేఁగునట్లు చేయుట సులభ మనియుఁ గా నప్పుడు నిర మిత్రముగా ధాత్రీతల మేల వచ్చుననియు విచారించినవాఁడై, యవ్విధం బంతయు గురువునకుఁ జెప్పి, ధర్మపుత్రుని నొంపక ప్రాణములతోఁ బట్టి యిచ్చునట్లు ప్రార్థించెను. అతని తలంపు నకు ద్రోణుఁడు మనంబునఁ గుత్సించుచు, నర్జునుఁ డొక్కఁడు సమీపమున లేనిచోఁ బాండవాగ్రజునిం బట్టి యిచ్చునట్లు వర మిచ్చెను. మూఢులగు కురుకుమారు లెల్ల ధర్మరాజు చిక్కు వడు ననియే తలంచి యుండిరి.

అట ద్రోణుని ప్రతిజ్ఞను విని భయ మందియున్న ధర్మ రాజునకు ధైర్యవచనములు సెప్పువాఁడై యర్జునుం డిట్లనియె.

క. "క్షోణీవల్లభ వినుమేఁ
ప్రాణములో నుండ నిన్నుఁ బట్టికొనఁగ నా
ద్రోణునకె కాదు సగణ
స్థాణున కైనను వశంబె తలఁ కేమిటికిన్."

అంత ధర్మతనయ దుర్యోధన బలంబులు క్రౌంచ శకటవ్యూహంబులై యమరి పోరాడఁ జొచ్చెను. ద్రోణుని ధృష్టద్యుమ్న పార్థ సాత్యకు లెదిరించిరి. భీమశల్యు లిరువురును గదాదండంబులు ద్రిప్పుచు నుద్దండముగాఁ బోరాడి పరస్పర గదా ఘాతములం మూర్ఛితులైరి. కర్ణపుత్రుఁడు వృషసేనుం డరి సైన్యములు గలంగ నురవడించుటను జూచి, నకులపుత్రుఁడు శతానీకుఁడును దత్సోదరులును వానిపైఁ గవిసిన, వానికి బాసటగా నశ్వత్థామప్రభృతులు వచ్చి వారిదెమి సూపిరి. ద్రోణాచార్యుఁడు రేఁగి ధర్మపుత్రుపై నుగ్రభంగిఁ దఱుముటం జూచి యాతని కడ్డముగా ననేక పాంచాలవీరులు వచ్చి యాచార్యుచే నీల్గిరి. అంత నర్జునుఁ డేతెంచి ఘోరంబుగాఁ బోరొనర్చి కుంభ సంభవునిసంరంభ ముడిపి యప్పు డన్నకైన యెడరు వాపెను.

రాజేంద్రా! రెండవనాఁటికయ్యమప్పుడు పార్థుని ధర్మ నందనునొద్ద నుండకుండఁ జేయుటకై త్రిగర్తపతియగుసుశర్మ నంశప్తకబలంబులం గూడుకొని యాక్రీడిని యుద్ధమునకుఁ బిల్చిన, నాతం డగ్రజునిరక్షణార్థముగాఁ బాంచాలవీరుఁ డగు సత్యజిత్తును నిలిపి, యన్నం జూచి,

క. "ఇతఁ డున్నయంత సేపును
మతి నేఁగెలువ వెఱవవలదు మా గురుచేతన్
హతుఁ డయ్యెనేని నిలుచుట
చతురత గా దనికిఁ దొలఁగి చనవలయు నృపా"

అని ధర్మరాజు నొడంబఱిచి, త్రిగర్తపతి సేనలపై నడరి, కోపదీపితమూర్తియై గాండీవచాపనిర్ముక్త బాణజాలంబుల సహస్రసంఖ్యలగు రథికవర్యులఁ గూల్చుచుండెను.

ధనురాచార్యుఁ డొక్కఁడె యుక్కు మిగిలి సురలు వెక్కసం బందఁ బోరుచు, ధర్మతనయునకు కెదురై నిల్చిన సత్యజిత్ప్రముఖ నిఖిల పాంచాలరథిక ముఖ్యుల శిరంబులు ద్రుంచి, తద్బలంబులం బెనుగాలికిఁ దూలుపృథుసమూహములవలెఁ బడఁ ద్రోచిన, ధర్మతనయుండు తమ్మునిమాటలు దలఁచి నిజరథంబును యుద్ధభూమికి దూరముగాఁ గొనిపోయెను. అతని వెనుకొని ద్రోణుండు తఱుము నొక్కట్టునఁ గాంచి కౌరవవీరులు ధర్మతనయునకై డెందమె గాఢనారసంబులు గుంభసంభవునిపైఁ బఱపిరి. దుస్సహప్రచ్ఛన్నయోధ యాసనిగ్గుగుం డగ్గలికతోఁ విరోధిసైన్యముల నొంచుచున్న నాతనియుద్ధకుఁ గయ్యమున కెవ్వాఁడు నోర్వలేక వెఱఁగుపడి యుండిరి. ధర్మరాజు మఱియుఁ జెదరినసేనలం గూర్చుకొని గుహునిపై నడరె, భగదత్తుండు సుప్రతీకము నెక్కి, పాండవసేనలపైఁ గవిసి, భీమసేనాభిమన్యులును దక్కిన దొరలును భీతిఁ గలంగి పాఱునట్లు చేసెను.

అర్జునుఁ డక్కడ నిజసేనాభంగము గని, తద్రక్షణార్థమై రథంబును సారథిచే మరల్పఁజేయ, మఱియు నాతని సుశర్మ యుద్ధమునకు బిల్చెను. ఆవీరుఁడు మరలి త్రిగర్తపతి

చాపకేతువులు ద్రుంచి, యతనితమ్ములతలలు పడవైచి, యా
తని మూర్ఛవోవునట్లేసి, సత్వరంబుగా భగదత్తుని మీఁదికి
వచ్చెను. అప్రాగ్జ్యోతిషాధిపతియనిమిషపతి సుతుపై నిజగజం
బును బఱప, జగన్నాథుఁ డప్పుడు తేరు నెదురునఁ ద్రిప్పి పాండవుని
రక్షించెను. ఆయేనుఁగు నరుని సేనలఁ గాళ్లఁ జమరిపచ్చడిసేసెను.
నరుఁ డంత భగదత్తునిపై దివ్యాస్త్రము లేయ, నాతఁడు కోపించి
వైష్ణవాస్త్రమంత్రము జపించి, చేతియంకుశమును వాసవనం
దనుఱొమ్మునపై వైచెను. నారాయణుఁడు దాని నిజవక్షంబునం
దాల్ప, నది తామరసపుష్పహారమై యతనిఱొమ్మునఁ గ్రాలు
చుండెను. కృష్ణుఁ డంత సిగ్గును గోపంబును బొందినజిష్ణునకు
వైష్ణవాస్త్రమును నొరులకు నోర్వవశము గాదని దానిప్రభా
వంబు సెప్పి, పాపవృత్తుఁడగు భగదత్తునిం గూల్ప నియమించిన,
నాతం డొక పటుతరసాయకంబున నేనుంగు పీనుంగై పడనేసి
భగదత్తునికంఠము ద్రుంచివైచెను.

అంత గాంధారకుమారవీరులు శకునితోఁ బార్థునిపై
నడచిరి. అతం డందఱితలలు భూమికి బలిసేసి, శకుని యుద్ధము
లోఁ గావించినమాయలు మాయించి, యాజూదరిం జూచి,

క. “మాయలు జూదములోఁ డన
పోయెం గా కింక నిచటఁ బొసఁగునె యవి, మ
త్సాయకము లడ్డసాల్లే
నీయాచవి లేదు పొమ్ము నిలువక మామా”

అని తిరస్కరించి పలికి, యతని దేహమ్మున వాల
మ్ములు నించిన నాతఁడు సిగ్గరి పాఱెను.

విను మహారాజేశ్వరా! అప్పుడు భీమార్జునధృష్టద్యుమ్న సాత్యకిప్రభృతియోధాగ్రేసరు లెల్ల ద్రోణుం బొదివి యతని పైఁ గ్రూరాస్త్రము లేసిన, నాతని కడ్డముగా నీపుత్రు లెల్ల వచ్చి తమవాఁడిమిఁగలిమిం జూపి పోరిరి. అప్పటియుద్ధము మహోగ్రమై యుండెను. రెండు మొనలను దేరులు బొడి యై రాలెను. గొడుగులుఁ బడగలుఁ బుడమిపైఁ బడియె. గజాశ్వభటాంగములు దునిసిపడియెను. నెత్తురేఱులై పాఱెను. అందు శవంబులు దేలెను. వియచ్చరు లచ్చెరువడి చూచుచుండిరి. అంత భీమపార్థులు రేఁగి కురుసైన్యములం దఱిమి యెదురుపడిన సూతపుత్రునిరథరథ్యసారథులం బడవైచిన, విరథుండగు కర్ణుని శాత్రవవార్ధిలో మునుఁగకుండునట్లు ద్రోణాశ్వత్థామ దుర్యోధను లుద్ధరించుకొని పోయిరి. అప్పుడు ప్రొద్దుగ్రుంకుటచే నందఱును మరలి చనిరి.

## (2) ద్రోణుని మూఁడవనాటియుద్ధము; అభిమన్యువధ.

రాజేంద్రా! వినుము. సూర్యోదయంబైన రెండు మొనలును గయ్యమునకు సిద్ధమై నడచునప్పుడు దుర్యోధనుఁ డాచార్యుం జూచి "ధర్మరాజుం బట్టి యిచ్చునట్లు చెప్పి నన్ను మోసపుచ్చి వెట్టిఁ జేయుట ధర్మ మగునా?" యని యడుగ, దానికాతఁడు,

ఉ. "ఎవ్వరి నెట్లు చేసెదనొ యేర్పడఁ జూడుము, నేఁడు పోరికిం
గవ్వడి రాకయుండఁ దొలఁగం గొనిపోవఁగఁ జాలువారి నీ
వెవ్వరి నైనఁ బంపు, మిది యేటికి నొండొకబుద్ధి సేసె, దే
నవ్వుచుఁ బల్కెనక్క ధరణీనాథ, యసత్యము గల్గ నేర్చునే."

అనియెను. అప్పుడు సంశప్తకవీరు లర్జునుం దొడరి వేఱొకప్రక్కకుఁ గొనిపోవునట్లు రారాజునకుఁ జెప్పిరి. అట్లే వా రాదినమున సురపతితనయుని యుద్ధమునకుఁ బిల్చి, యతనితో ఘోరప్రకారముగా సంగ్రామ మొనర్చుచుండిరి.

ఆచార్యుం డొండొకకడ మిగిలినసైన్యములనెల్ల నభేద్యమగు పద్మవ్యూహముగా నమర్చి దానిలో బహుదేశరాజులను, రాజపుత్రులను, దళకేసరిస్థానంబుల నిల్పి, యశ్వత్థామ కృపశకునిప్రముఖులతోఁ గురుపతిని గర్ణికస్థుఁడై యుండునట్లు చేసి, తా నాదుర్గమంబగు మొగ్గరమునకు మొగమై నిల్చి, యెదిర్చిన పాండవపక్షవీరులను జిక్కువఱచుచు వాఁడితూపుల వేఁడిమి సూపుచుండెను.

ధర్మరాజా గట్టితనంబున మొగ్గరమును జించి చొచ్చుటకు, వెరవరి యగు పార్థునిపట్టి యొక్కఁడే యోపునని తలఁచి, యభిమన్యుకుమారుం బిల్చి యగ్గించి, మొగ్గరం బొకింత సించి, యాలంబులోఁ జొచ్చునట్లు తోడ్పడ నియోగించెను. ఆ దేవేంద్రపౌత్రుఁడు తండ్రిపెదతండ్రుల కుబ్బ, యుడుకును దన్ను మెచ్చి చూడ న పగముల వి టియొజ్జను నలయించి, మెఱుఁగు మెఱచినట్లు రయంబున వ్యూహంబు సొచ్చె. దానిలో మున్నీటిలోఁ దిరుగు మీనుపోలిక, దిరుగుచుఁ బెక్కుతేరులును దొరలును, కరిపిండును, గుఱ్ఱపుదండములును, గాల్బలములును బుడమిం దెళ్ళునట్లు వాలమ్ములు గురిసి, మొగ్గరంబంతయు నిమిష మాత్రమునఁ గలంగఁ జేసెను. అట్టికతంబుగాఁ గురుసేనలతోఁ బోరుచున్న గాండీవిపుత్రునకుఁ దోడు సూపనెంచి యుధిష్ఠిర ప్రభృతులును, పాంచాల యాదవ పాండ్య కేకయవీరులును,

బద్మవ్యూహంబు సొచ్చినప్పుడు, వారి కెల్ల సైంధవుఁ డడ్డ పడియె. అతఁ డీశ్వరునిచే నొకనాఁటికయ్యమున నరుఁ డొక్క రుండు దక్క మిగిలిన పాండవులనెల్ల గెల్చునట్లు వరంబుగొనిన వాఁడు గావున, నప్పు డాతనిఁ దత్ప్రభావం బొందుటచే, నతండు బలంబును, శౌర్యంబును, ధైర్యంబును మెఱయ, మొగరం బులో నెవ్వరిం జొఱకుండ నాఁగుచు, విరోధిసైన్యముల దైన్య మొందించుచుండెను.

ధృతరాష్ట్రభూపతీ! అక్కడ నొంటిమై మొగ్గరంబు గలఁచు సుభద్రాపౌత్రునిఁ బొదివి ద్రోణ కృప శకుని శల్య కర్ణ ప్రభృతులును, దుర్యోధన దుశ్శాసనాది కురుకుమారు లును నిశితబాణప్రచయంబుల ముంచిన, నా పరాక్రమనిధి వారి యస్త్రంబులు వారించి, ద్రోణ కృపాచార్యుల శౌర్య ముడిపి, శల్యు నొక్కపటుభల్లంబున మూర్ఛిల్ల నేసి, కర్ణును దీర్ఘబాణార్ణవమున ముంచి నొప్పించి, దుర్యోధన దుశ్శాసనులం బాఱఁద్రోలి, దుర్యోధనపుత్రుఁడగు లక్ష్మణకుమారునితలఁ ద్రుంచి, కర్ణుని తమ్ములతలలు భూమికి బలిసేసి, కోసలపతియగు బృహద్బలుంజంపి, ఘోరప్రకారంబుగా సమరంబు సల్పుచుం డెను. అప్పు డాచార్యుఁడు సూతతనయుం జూచి యభిమన్యుఁడు కవచధారణమను విద్య నెఱిఁగినవాఁడగుటచే నాతనినొప్పింప శక్యము కాదనియు, ధనుర్ధరుఁడై యుండ నతనిఁ జెనక నల వి కాదనియు, నతని వంచనచే విరథుఁ జేయుట మే లనియు నెఱింగింప, నాతఁ డక్కుమార వీరునకు భయ మందినవానివలె వెనుకకొదిగి పిఱిందికివచ్చి, యొక్క పటుభల్లమున నాతనిచేతి విల్లు దునిమెను. గురుఁ డప్పు డాయభిమన్యునిగుఱ్ఱములం జం

పెను. కృపుఁడు సారథినిం గూల్చెను. అందఱును వాని ననేక శస్త్రాస్త్రముల నేసిరి. నెత్తుటఁదోఁగుచు నాబాలుఁడు వాలును బలకయుఁ గొని, యాకసంబున కెగసెను. ఎవ్వరిమీఁది కుఱుకు నోయని యందఱు భయమందుచుండ, ద్రోణుఁ డాతని చేతిసాధనములు తునియలై పడ నేసెను. మగతనంబు డింపక యాతఁడు చక్రంబు గొని ద్రోణాచార్యులకు నడ్డమైన సైన్యంబుల నఱకెను. శకునికర్ణ శల్యు లాచక్రముం బొడిసేసిరి. అభిమన్యుఁడంత గదఁ గొని యశ్వత్థామపైఁ గవియ నాతఁడు తే రుఱికితప్పించుకొనియె. ఆతనిం జుట్టిముట్టిన యోధు లనేకులు గద చేఁ గూలిరి. అప్పుడు దుశ్శాసనపుత్త్రుండు గదవీచు గదాధరునల్లున కడ్డపడి యతనిచే విరథుఁడై, తానుగదగొని యాతనితో రయంబును వెరవునుజలమును మెఱయఁబోరొనర్చెను. రక్తసిక్తాంగులై యియ్యిరువురు నించుక సేపు చూపఱు మెచ్చుమచ్చరంబునంబెనఁగి, పరస్పర గదా హతులై యవనింగూలిరి. ప్రొద్దుగ్రుంకుటచే నప్పు డందఱును సమరంబు చాలించి నిజావాసంబులకుఁ జనిరి.

రాజోత్తమా! అత్తెఱంగున శత్రుసైన్య సరోవర దైన్యసంపాదనసమర్థం బగు పార్థతనయ మత్తేభంబును గౌరవక్రూరకిరాతని కాయంబు గూల్చుటకుఁ బాండవులు చాల వగచిరి. కౌరవులు హర్షించి తమవిడిదల సేరిరి. అర్జునుఁడు గుణభద్రుండగు సౌభద్రుండు సచ్చిన విధంబువిని పగ పెల్లున మునిఁగి వాసుదేవధర్మనందనులచేఁ దెలిసి; మఱునాఁడు ప్రొద్దుగ్రుంకుటకు ముందు సైంధవుని వధించునట్లును, దనకట్లుచేయ నలవి కానిచో ననలంబు సొచ్చునట్లును బ్రతిజ్ఞ సేసెను. తత్పక్షము వారప్పుడు శోక ముడిగి తెంపు వాటించిరి.

(3) ద్రోణుని సాల్గవనాఁటి యుద్ధము. సైంధవవధ.

సైంధవుఁ డారాత్రియే తనచారులచే నర్జునునిప్రతిజ్ఞ విని భయమంది, యుద్ధమునకు రాక తొలఁగి పోవుట కార్యమని విచారించి దుర్యోధనునకుఁ జెప్ప, స్వకార్యనిరతుండగు నారా రా జాతనికి ధైర్యవచనములు సెప్పెను. ద్రోణుఁ డర్జునునకుఁ జొరనలవికాని దృఢవ్యూహము నిర్మించి యాతని రక్షించునట్లు చెప్పి, మృత్యువునకు వెఱపక సమరము సేయుటయే రాచపాడిగా నిర్ణయించెను సైంధవుఁడు కలఁక దేఱి నిశ్చింతుఁడై యుండెను.

పాండవహితార్థియు భక్తరక్షణపరాయణుండు నగు నారాయణుఁడు దుష్కరమగు నరునిప్రతిజ్ఞ నెఱవేర్ప నెంచి, పార్థుని మందిరమునకు రాత్రి చని, యందాతని శుచియై శివపూజ గావించి దర్భశయ్యపై నిద్రింపఁ బంచి తన గృహమునకుఁ బోయెను. కౌంతేయుఁడు తనప్రతిజ్ఞను దుదిముట్టఁ జేయుట కష్టతరమైన కార్యమని తలఁచి వగచుచు నాశయ్యపై నిద్రించుచుండఁ, గలలోఁ గృష్ణుఁడు దన్నాశ్వాసించినట్లును, నతనితోఁ గైలాసమునకుఁ బోయి శివుని స్తుతించి యమ్మహాదేవుకరుణ నువ్యక్తముగాఁ బాశుపతాస్త్రమును బడసినట్లును, దా నాముకుందునకు మ్రొక్కి మగిడి శిబిరమునకు వచ్చినట్లును గలగాంచెను. పార్థుఁ డవ్విధంబంతయు మఱునాఁ డుదయము వాసుదేవాదులతోఁ గొలువున్నయన్నకుఁ దెల్ప, నందున్ననరపతులెల్ల సంతోషించి శుభశకునములు గైకొనుచు, యుద్ధమునకు వెడలిరి.

అంతకు ముందక్కడ ద్రోణుఁడు సైంధవరక్షణార్థముగా భూరిశ్రవఃకర్ణకృపాశ్వత్థామశల్య వృషసేనుల బహుళ

చతురంగబలములతో నుండ నియమించి, వారికి ముందుగా నేరికిఁ జొర నశక్యమైన శకటవ్యూహము దీర్చి, తదంగమగు పద్మ సూచీవ్యూహములకు ముంగలిగాఁ, గృతవర్మ కాంభోజపతుల సేనలతో నుండఁబంచి, యతిదృఢంబును, నపూర్వ దృష్టంబును, నతివిచిత్రంబు నగు నా బండి మొగ్గరమునకు ముందుగాఁ దా నుద్దడంబగు కోదండము చేతఁగొని, దండధరునిమాడ్కి, వేదికాధ్వజంబు వెలయునిజరథంబుపై నిల్చి యుండెను

అర్జునుఁడు సాత్యకిని ధర్మతనయరక్షణార్థమై యుండఁ గోరి కౌరవవ్యూహముపై నడర, నాచార్యునకును దలకడచి దుర్మర్షణ దుశ్శాసను లావ గ్గని గజసైన్యములతోఁ దాఁకిరి. వారిరువురను భంగపఱిచి యర్జునుఁ డాచార్యునితో రణమొనర్చుచు, నతని నతిక్రమింప లేక చిక్కువడియుండెను. కృష్ణుఁ డది గని, కడుసత్వరముగాఁ దేరినిగురునకుఁ బ్రదక్షిణముగాఁ బఱపి మొగ్గరంబుసొచ్చెను. ద్రోణుఁడు వెంటనంటి తీవ్రనారాచముల నరహరుల నొప్పించెనుగాని, పార్థుఁ డయ్యస్త్రగురువును మాఱేయక వంచించి కృతవర్మ సైన్యములోఁ దూఱెను. గురుఁడు చేయునదిలేక సైన్యరక్షణార్థము సేనాముఖంబునకు వచ్చెను. పార్థునిబాణంబులచేఁ గృతవర్మనొచ్చి మూర్ఛిల్లెను. వరుణతనయుండు శ్రుతాయువును, గాంభోజపతియగు సుదక్షిణుండును గూలిరి; పెక్కుచతురంగబలములు నుగ్గయ్యెను.

నరుఁ డట్లు మొగ్గరంబు గలఁచి సైంధవుని సమీపించుటను రారాజు గని, యాచార్యునియొద్దకు వచ్చి, యాతనిఁ బాండవపక్షపాతి యని నిందించి పలికి, యతఁడు కోపించునో యని

భయపడి, కార్యభారమును దలంచి, సైంధవుని రక్షింప నుపాయంబు సేయువలయునని ప్రార్థించెను. ఆచార్యుఁడు ప్రీతుఁడై నను గోపము తోఁపనీయక, రారాజుతోఁ దానువ్యూహ ముఖమును వదలిన శత్రువులచె భంగము గలుననియు, నప్పుడు సైంధవ రక్షణము దుష్కరమగుననియుఁ జెప్పి, యతనికి సమంత్రకముగా నొక యభేద్యమగు కవచము దొడిగి, తత్ప్రభావమున నిర్భయముగాఁ గృష్ణపార్థుల నెదిరించునట్లు చెప్పి పంపెను.

అంత ద్రోణాచార్యుని ధృష్టద్యుమ్నుఁడు మున్నగు పాండవవీరులు సేనలతో మార్కొనిరి. అప్పుడు మధ్యాహ్నమయ్యెను. ఆకాశమునఁ వెలుఁగుసూర్యుని మిగులఁ దలఁచి, పుడమి యిద్దఱుసూర్యులను దాల్చెనోయనునట్లు, ద్రోణధృష్టద్యుమ్నులు తేజోమూర్తులై యుగ్రముగాఁ బోరాడిరి. ఆచార్యుఁడు పాంచాలవీరుని విరథుఁ జేసి ప్రాణంబు గొన నొకపటు బాణమేసిన, దానిని సాత్యకినడుమఁ ద్రుంచెను. సాత్యకిపై ద్రోణుఁడు గవియ, నప్పు డందఱు గురునితో నయ్యెడఁ జేసిన కయ్యము వేల్పులకును వెఱఁ గయ్యెడుచందమయ్యె.

అక్కడఁ బార్థుఁడు కార్చిచ్చువలెఁ బేర్చి మార్గణార్చులఁ గౌరవవ్యూహగహనదాహంబు సేయుచుండ, నతనితో విందానువిందులను వీరు లవంతీశ్వరు లన్నదమ్ములొక్క తేరిపై నుండి పోరు సల్పువారు దలపడి, బాణవర్షములు గురిసి తమకీడిమి సొంపునెఱపింపఁ జేసిరి. కపిలంపపతితనయుఁడకంపితమూర్తియై, యంపవెల్లులవారినిముంచి వారితలలు డొల్లనేసెను. అందఱు భయపడి సైంధవునియెడ నిరాశులైరి. దుర్యోధనుఁ డప్పుడు గురుఁడిచ్చిన మైమఱువుచే వెఱపుసెడి క్రీడి నెదిర్చి, యతనితో

చ. వినుము కిరీటి, దివ్యశరవేదివి నాఁ జను దేను లేనిచో
టను, మును సెల్లెసీకు, నిచటం జననిత్తునె, యిప్డు నీబలం
బును హరినేర్పుఁ జూచుటకుఁ బోరికి వచ్చితి,నీవు పాండురా
జునకుజనించి తేనిఁ దెగి చూపుముశౌర్యమునస్త్రవీర్యమున్.

అని క్రూరనారాచంబుల నరనారాయణుల నొప్పించిన వాసవనందనుఁ డలిగి యాతనిపై శాతశరపరంపరాతంబు లేసెను. అతఁడు నొవ్వడకుండుటనుజూచి ద్రోణునిచేఁ గవచంబు నడసినవాఁడని యెఱిఁగి నవ్వుచు దానిని పొడి సేయ నెంచి, నిఖిల కవచనిర్భేదనాస్త్రము నేసిన, నశ్వత్థామ దానిని సర్వాస్త్ర ఘాతినియను సాధనంబున విఱిచెను. ఆసందున మఱియు దుర్యోధనుఁడు దొమ్మిసేసియమ్ములఁ గృష్ణార్జునుల నొప్పింప, నరుఁడు రారాజును విరథునిగాఁ జేసెను.

అప్పుడు సైంధవరక్షణార్థమై నిల్చినదొరలెల్ల నొక్క పెట్టున నింద్రసునిపట్టిపై నడరిరి. అతం డందఱకన్నిరూపులై యేపు మిగిలి పోరుచుండ, నాతనికి సహాయులై ధర్మపుత్రునిచే నియోగింపఁబడిన సాత్యకియు భీమసేనుఁడును వరుసగా వచ్చిరి. అప్పటియుద్ధము నిలింపస్తోత్రపాత్ర మయ్యెను.

ఇట మొగ్గరంబువాఁకిట విాటియొజ్జ వేఁడిమి సూపి పాంచాల యాదవ మాత్స్య బలంబుల జర్జరితంబులుగాఁ జేయుచుండ, ధర్మపుత్ర నకుల సహదేవ ధృష్టద్యుమ్న శిఖండ్యాది వీరు లాతని మార్కొని తమచే నోపినంత పోరాడుచుండిరి.

రాజవరా! అట వ్యూహంబునడుమ భూరిశ్రవునిచే సాత్యకియు, సూతతనయునిచే భీముఁడును భంగపడిరి. అదె

ట్లన, భూరిబలుం డైన యాబాహ్లీకపౌత్రుడు మల్లయుద్ధనై పుణ్యంబున సాత్యకిం బడద్రోసి ఱొమ్ము ద్రొక్కి చేత త్రిచ్చే గుత్తుకఁ గోయనున్న యవసరంబున, మధుకైటభారి తమ్మునికైన పాటుగని, కిరీటికిం జెప్ప సత్వరంబుగా నాకురువీరునిచేయి దెగ వ్రేయించెను. విఫలమనోరథుండగు భూరిశ్రవుఁడు పార్థుని నిందించి, యాయుధములు విడిచి, ప్రాయోపవేశమున నొడలు దొఱఁగ నుద్యుక్తుఁడయ్యెను. అంతలో సాత్యకిలేచి, కృష్ణార్జునులు వారించినను వినక, తనకరవాలమున నాభూరిశ్రవుని తల నఱికెను.

భీముండును గర్ణుండును ఘోరప్రకారముగా సమరంబు సేయునప్పుడు సూతపుత్రుఁడు పెక్కుమాఱులు విరథుఁడై యోడి నను విడువక, చలంబునం బెనంగి, యెక్కువశ్రమంబడరియున్న వడముడిని విరథుఁ జేసి, తఱిమి కదిసి, "ఓరీ! తిండిపోతగు నీకు భండనమేటికి ? అడవిలో మునివృత్తినుండరాదా? యుద్ధము సేయనెంచిన, నాబోటివీరులం జెనకకుండుము. అదిగోఁ గృష్ణార్జునులున్నవారు. వారిం జేరఁబొ"మ్మని నిందించి పల్కి, కుంతికిచ్చిన బాసం దలఁచి యాతనిం జంపక విడిచెను. రాజేంద్రా! భీముడు చిన్నవోయినమోముతోఁ బారునియొద్దకుఁ బోయి, తనపరిభవంబు సెప్పి కర్ణునిం దనకుఁ జంపకుండ రామియెఱింగించిన, నాతండు "అన్నా ! నీ కాచింత యేల? నిన్నాతఁడు నాముందట నిందించుట నన్ను నిందించుటకదా?"యని యూరడిల్లునట్లు పల్కి, కర్ణుని సమీపించి.

"ఉ. ఏమిర కర్ణ ! భీము నటులేటికిఁ దిట్టి, తతండు దోల సి
గ్గేమియు లేక పాఱునెడ నెవ్వరు దిట్టిరి నిన్ను, గెల్పునం

గ్రామములోనఁ దప్పిదము గల్గినయంతన యంతగర్వ మే
లా, మునునిన్నెఱుంగమె చలంబున సాత్యకియిప్డు గెల్వఁడే''.

నీతులునమాటలు మఱవకుము. నాకొడుకువిల్లు నీ వధర్మయుద్ధమునం దునిమితివి. దానికి ఫలముగా ధర్మయుద్ధమున నీపుత్రుఁడగు వృషసేనునితల గోయుదు. నిన్నెట్లు చేసెదనో చూడు''మని యుగ్రభంగి వానిపై వాలమ్ములు గురిసెను. అనేక సైన్యములును దొరలును నరునిపైఁ గవిసిరి. అప్పటిపోరు ఘోరమయ్యెను.

దుర్యోధనుఁ డప్పుడు కర్ణుం జేరి యాతనితోఁ బ్రొద్దు గ్రుంక నించుకసేపుండుటను జెప్పి, కొంతతడవు పార్థునితోఁ బోరి యాతనికడఁకె మాన్పినచో, నాతఁ డగ్నిప్రవేశ మొనరించు నని యెఱింగించి యుద్ధమునకుఁ బురికొల్ప, నాతఁడు కృపాశ్వత్థామ శల్య వృషసేనులతో నింద్రతనయు నెదిరించి బాణముల నతని ముంచెను. అర్జునుఁడొండొక కన్నిరూపులై పెనంగి వారి యస్త్రములు వారించి, కర్ణకృపుల రథంబులు పొడిసేసి, శల్యాశ్వత్థామల బాణంబులం జిక్కుపఱిచి, సైంధవునిపైఁగవిసివాని ధ్వజమును సారథియు నేలఁబడున ట్లేసెను. సైంధవరక్షణపరాయణులై యక్షీణపరాక్రమమునఁ బ్రాణములు డాపక కురువీరులందఱు నరనారాయణులం జుట్టిముట్టి ఘోరప్రకారముగా సంగరము గావించిరి.

అర్జునుఁడు సైంధవుం జంపలేక పోరుచుఁ బ్రొద్దువంకఁ జూచుచుండ, నారాయణుం డాతనితో మాయగావించినం గాని దాయ పడఁడని చెప్పి, తోయజమిత్రుమండలముగప్పెను. అప్పుడు

కౌరవు లది ప్రొద్దుగ్రుంకుటగా భావించి, సంతోషించి యార్చిరి. సైంధవుఁడు హర్షించి శీర్షమెత్తి పడమరవైపు చూచుచుండ నద్దురాత్ముని హరి నరునకుఁ జూపి తల దెగవేయునట్లు చెప్ప నాతం డొకపటుసాయకమున నాతనిమస్తకంబు దునిమి, కృష్ణునియాజ్ఞచొప్పున దాని నేలంబడకుండునట్లు వినువీథులోఁ ద్రిప్పుచుండెను.

అంత మాయపుఁజీఁకటి తొలఁగ సూర్యుఁ డస్తాద్రిపై నందఱకుఁ దోఁచెను. కౌరవు లర్జునునిపైఁ గవిసి మఱియు బాణంబు లేసిన, వాఁడు వారిశరంబులు వారించుచు, నాకసంబులోని సైంధవుతలను నేమఱక త్రిప్పుచుండెను కృష్ణుఁ డప్పుడు ఫల్గునితో సైంధవునితండ్రి వృద్ధక్షత్రుండు తనతపోబలంబున నెవఁడు తనకొడుకుతల నేలం బడవేయునో వానితల నూఱుపఱియలై పోవునట్లు శాపమిచ్చినవాఁ డనియు, నావృద్ధక్షత్రుండు శమంతపంచకసమీపాశ్రమమున నున్నవాఁ డనియుఁ, బాశుపతంబుచే నాతనితొడమీఁద నాతలను బడవేయుట కార్యమనియుఁ జెప్ప, నాతఁడట్లె యాదివ్యసాధనముచేఁ గావించెను. అట జపముసేయుచుండిన వృద్ధక్షత్రుండు వెఱఁగందిలేవఁగా, నతనికొడుకుతల తొడపైనుండి నేలం బడియె. అప్పు డాతఁడే నిజపుత్రశిరఃపాతమునకుఁ గారణమై శిరంబు నూఱుపఱియలై మృత్యుగోచరుం డయ్యెను.

కౌరవవంశోత్తమా! అట్లు కవ్వడి చేసినపనికి మన సైన్యములు వెఱఁగందెను. సైంధవునిచావు సూచి దుర్యోధనాదులెల్లఁ గడు ఖిన్నులైరి. పాండవబలములలో నప్పుడు శంఖా

రావములును బహుతూర్య నినాదములును జెలంగెను. ధర్మ రాజు తగినవిధంబున వాసుదేవార్జునుల విక్రమంబు గొని యాడెను.

—: { (4) ద్రోణుని నాల్గవనాఁటి రాత్రికి య్యుద్ధము. ఇంద్రునిశక్తిచేఁ కర్ణుఁడు ఘటోత్కచునిం గూల్చుట. } :—

దుర్యోధనుఁడు తన సేనలో నెడతెగ హీనుల బలంబు నాద నంబున సైంధవరక్షణార్థమెకడఁగి మడియుటకుఁ గడువిషాదముఁ బొంది యాచార్యుని నిందించిపలుక, నామహనీయచరిత్రుఁడా భూమీశుతోఁ బాండుపుత్రులు దైవబలసంపన్నులనియు, నట్టి వారికిని, సాధ్వియగు పాంచాలికిని జేసినకీడే కౌరవ్యులఁ జెఱుచు ననియుఁ దెల్పి, పోయినదానికి వగవక, సేనల మోహరించు కొని యుత్సాహము వాటించి యాహవమునకుఁ బూనున ట్లుప దేశించెను. కర్ణుండును రారాజూరడిల్లునట్టివాక్యములాడెను.

రాజా! ఆదినము సైన్యములు రెండును సూర్యుఁడస్త మించినను విడువక కరదీపికలు వెలుఁగఁజేసి యుగ్రముగాఁ బెనంగెను. అప్పుడు ధనురాచార్యుఁడు రేఁగి పెక్కువేలగు పాం చాల రథికుల రూపడంచి పాండవబలసంక్షయకరుఁ డయ్యెను. భీమసేనునిచే దుర్మదదుష్కర్ణాది కురుకుమారులు మడిసిరి. కర్ణుఁడు సహదేవుని భంగపఱిచి కుంతిమాటలు దలఁచి చంపక యాతని విడిచిపెట్టెను. అశ్వత్థామచే ఘటోత్కచునికొడు కం జనపర్వుఁడీల్గెను. పుత్రమరణంబు గనుంగొని రోషభీషణాకా రుఁడై హిడింబాతనయుఁడు కౌరవపక్షరాక్షసబలముల సంక్ష యమొందఁజేసి, మాయాబలంబున శత్రువులంగలంచి, తుదకుఁ

గర్ణునిచేతియింద్రునిశక్తిచేఁగూలెను. పాండవులు దానికి ఖుక్కిలినగచిరి.కృష్ణుఁడు సూతతనయుచేతియమోఘంబగుశక్తి ఘటోత్కచునకై వ్యర్థమైపోవుటచే,నరునకింక సూతనందనునివలన భయముగల్గనేరదని చెప్పి ధర్మతనయాదుల నాశ్వాసించెను.''

ధృతరాష్ట్రుఁ డప్పుడు సంజయుంజూచి "ఇన్నిదినంబులా కర్ణుఁడు నరునిపై నేలయాశక్తిని వేయఁడయ్యెను? వాఁడు తప్పు సేసె. దానిచే నర్జునునిం గూల్చినఁ బాండుపుత్రులు రణమునకుఁ బూనుదురా? నాకొడుకులును మూర్ఖులు, వాని కాపనిఁ దెలియఁ జెప్పరైరి కదా'' యని దుఃఖించి పలికిన, నాతనికి మహాప్రాజ్ఞుఁడగు సంజయుఁ డిట్లనియె. "దేవా! నిత్యము నీకొడుకులు రాత్రులందు శక్తిని నరునిపైఁ బ్రయోగించునట్లు కర్ణునకుఁ జెప్పుచుందురు. వాఁడును వారితో రేపకడ తనశక్తిచే మాధవధనంజయులలో నొక్కని హతము సేయఁ గలవాఁడనని పల్కుచుండును. యుద్ధరంగమునకు వచ్చునప్పుడంతయు దానిమఱతురు. ఇది దైవయోగము; కృష్ణునిమాయ సుమ్ము. సర్వాంతరాత్ముఁడును, సర్వప్రవర్తకుండును, సర్వకారణుండును నైన పరమాత్ముని సహాయునిగాఁ బడసిన గొంతికొడుకుల కొక్కయెడరు పుట్టునా?అది యట్లుండనిమ్ము. రణంబు తెఱంగువినుము. రెండు సేన లట్లు రాత్రి పోరిపోరి డస్సి చీఁకటిలో నేమియుఁ జేయలేక కొంతసేపు విశ్రమించి, చంద్రుఁ డుదయించినతర్వాత మఱియు వీరారంభమునకుఁ బూనెను. ద్రోణుఁడు నడిరేయి ప్రకాశించు సూర్యుఁడోయనునట్లు దుస్సహతేజోమూర్తియై విరాటద్రుపద భూపాలుర శిరంబులు ద్రుంచి, తద్బలంబులం బడలువడఁ జేసెను. తండ్రిచావునకు వగచి ధృష్టద్యుమ్నుఁడు క్రోధమూర్తియై

గురునిపై నగ్నిపైఁబడు శలభంబురీతినడరి భంగపడిన, నాజో దునిగాడ్పు పట్టి రక్షించి తన తేరిపైఁగొని పోయెను.

### (5) ద్రోణునిచావునకుఁ గోపించి, యశ్వత్థామ పాండవులపై దివ్యాస్త్రము వేయుట.

రాజవరా! అప్పుడు సూర్యోదయమై ప్రొద్దెక్కుచుండి నను రెండుమొనలవారును జలంబుడింపక పోరుచుండిరి. పార్థుఁ డొక్కఁడాచార్యునితో ధీరత వాటించి యోపినంత పోరాడెను. ధర్మపుత్ర భీమ నకుల సహదేవులు ద్రోణునితాఁకున కోర్వలేక యొకప్రక్కకొదిఁగి, తమలో నాచార్యునిపరాక్రమంబు విష యమై పలుకుచుండ, వాసుదేవుఁడు వారిం జేరవచ్చి, ధర్మనంద నునితో గురుని జయింప దేవదానవులకైన వశముగా దనియు, నశ్వత్థామ చచ్చెనని యతనికిఁ జెప్పిన నతం డస్త్రసన్న్యాసము సేయుననియు, నప్పుడతని సాధింపనలవి యగుననియు నెఱుఁగఁ జెప్పెను. అప్పాండవాగ్రజుఁడు మాళవేంద్రుఁడగు నింద్రవర్మ యనువానియేనుఁగు 'అశ్వత్థామ' యను పేరుగలది భీముని చేఁ జచ్చుట వినినవాఁడు గావున, నాచార్యుసమీపించి యెలుంగెత్తి "యశ్వత్థామ చచ్చె" నని పలికి, మఱియు నతనికి వినరాకుండఁ దిన్ననియెలుంగున 'కుంజర' మని చెప్పెను.

గురుఁ డప్పలుకులు విని సమరంబు చాలించి శాంతభావమునొందెను. ఇట్లు నాల్గుదివసంబులు, నొకరాత్రియు, నైదవ దినమున నిరువదిగడియలును గురుఁ డసమసమరక్రీడావినోది యై యస్త్రసన్న్యాస మొనరించి, కర్ణ కృప దుర్యోధనులం బేర్కొని తెలివిగల్గి వర్తించునటుపలికి, యోగబలంబునఁ బరమపదవికిఁ

జనియెను. అప్పుడు దృష్టద్యుమ్నుఁ డతికుపితుఁడై ధర్మరాజు వారించి పలికినను వినక, ద్రోణుని సమీపించి చేతికృపాణమున నాతని కంఠముదునిమెను. సైన్యములు హాహా కారములు సేసెను. కౌరవులు వెఱచిపాఱిరి.

వేఱొకప్రక్క యుద్ధము సేయుచుండు నశ్వత్థామ దుర్యోధనునిచేఁ దండ్రిమరణ ప్రకారంబువిని విషాదరోషంబులడర, శత్రువుల నెల్లఁగాల్పనెంచి, సేనలంగూర్చుకొని, పాండవ బలములపై నారాయణాస్త్రమేసిన, నది వారిపైను గ్రానల జ్వాలలు నిగుడఁ గవియు చుండెను. కృష్ణుఁడందఱను దమ దమ వాహనములుదిగి, చేతికైదువులు నేలఁబడ వైచునట్లు చెప్ప, వారందఱు నట్లే చేసిరి. దైన్యమొందిన యాపాండవ సైన్యమునుగని, యయస్త్రము శాంతింబొందెను. ఎవ్వరికి నే కీడును గల్గలేదు.

కృష్ణుని మంత్రంబున నారాయణాస్త్రము వృథయగుటకు గురుతనయుఁడు కోపించి, సాత్యకిధృష్టద్యుమ్నుల మూర్ఛ వోవునట్లుసేసి, యర్జునునిపైఁగవిసి యాగ్నేయాస్త్రమేయ, నది పాండవసేవలం దేకాక్షౌహిణీబలంబుల దహించెను. పార్థుఁడు దాని బ్రహ్మాస్త్రప్రయోగంబున శమింపఁజేసెను.

అశ్వత్థామ తన యాగ్నేయాస్త్రముచేఁ గృష్ణధనంజయులు మడియకుండుటకు వగచుచుండఁ నతని పాలికివ్యాసుఁ డేతెంచి వచ్చి, యాదిమునులగు నరనారాయణుల దివ్యప్రభావ మెఱింగించి,వారు దుష్టశిక్షణ సాధుపోషణధర్మసంస్థాపనార్థము లుగా భువివిజయవాసు దేవులై పుట్టుటఁదెల్ప, నాతండు తెలివి గలిగి, శోకంబువిడిచి, సమరంబు సాలింప దుర్యోధనుసియ

మించి, యందఱితోఁ గౌరవస్కంధావారము సొచ్చెను. పాండవులు సింహనాదముసేసి చెలఁగు సైన్యములతోఁ దమశిబిరంబు సొచ్చిరి.

ఆ రాత్రి వేదవ్యాస మహామునీంద్రుఁడు పార్థునకుఁ బొడసూపి, యతనికిఁ బరమశివుని మహిమయెఱింగించి, యమ్మహాదేవు కరుణనతండు శత్రువులం జయింపఁగల్గెనని తెలియఁ జెప్పిన, నాకాంతేయ మధ్యముఁడు, చంద్రధరుండగు పరమశివునకు భక్తిపూర్వకదండ ప్రణామంబులాచరించి, పరమానంద మను భవించుచుండెను.

ఇది ద్రోణపర్వకథా సంగ్రహము.



శ్రీ

శుభమస్తు.

# బాలభారతము.

## VIII. కర్ణపర్వము.



### (1) కర్ణుని ప్రథమదివస యుద్ధము.

వైశంపాయనుఁడు జనమేజయున కిట్లనియె. "రాజేంద్రా! సంజయుఁడట్లు ధృతరాష్ట్రునకు ద్రోణునిచావు వెల్లడించి మఱియుఁ బాలికలనికిం బోయి యందు రెండునాళ్ల సమరంబు సూచి కరిపురికిమగిడివచ్చి, యంతఃపురంబులో నున్నవృద్ధరాజుంగని డగ్గుత్తికవెట్టుచు భీమపార్థులచే దుశ్శాసన కర్ణుల కైన చావు వెల్లడింప, నాయంధనృపతి మహాశోకార్తుఁడై కర్ణుం దలఁచి,

క. "సంజయ మురభంజనుని ధ
నంజయునిం జీరికిం గొనఁడు కర్ణుండిం
ద్రుం జెనకియైన గెలుతున
నుం జచ్చెనె యట్టివాఁడు నేఁ డుంగియ్యమునన్."

అని పలుతెఱంగులఁ బలవింపుచుఁ, గొడుకుల గెల్పు వినవేడుకమీఱి యనర్థోన్ముఖుఁడై జలనిపాగ్నులఁ బ్రాణంబులు విడుచుచు హాస్యకుని వచ్చిన, సంజయుఁ డాతనికి నొవ్వకుండునట్టు మాటలాడ మనసొగ్గినవాఁడై యిట్లనియె.

"రాజేంద్రా! నీకొడుకు కర్ణునకు సర్వసేనాధిపత్యమిచ్చి తన్ను యుద్ధములో గెలిపింపవేడిన, నాతండును సైన్యములను మకరవ్యూహంబు గానమర్చి, కృతవర్మ కృపశకునియులూంకాశ్వత్థామ ప్రభృతివీరులఁ దగిన యెడల నిల్పి, తాను దుండ భాగమునందుఁ బ్రచండమూర్తియై పొలిచెను. పాండవుల సైన్యములర్ధ చంద్రవ్యూహముగా నర్జునునిచేఁ దీర్పఁబడియె. చిందములమ్రోఁతయు, రథనేమి నిస్వనంబులును, గజబృంహితధ్వనులును, హయహేషారావంబులును వీరభటుల యార్పునుజెలంగ, నయ్యిరువాహినులు నొండొంట సంకులంబుగాఁ బోరునప్పుడు, గాడ్పుపట్టి యేనుంగుగమితోఁ బోరుకులూతపతి క్షేమధూర్తినింజంపి యశ్వత్థామపైఁ గవిసిన, నతండును నతండును సమవిక్రమశాలురై పోరి పరస్పరబాణ నిహతిచే మూర్ఛిల్లిరి. శల్యుఁడు పార్థతనయుఁడు శ్రుతకీర్తితోఁ బోరియతని నోడించి, సింగంబు మృగంబులఁ దఱిమివధియించు మాడ్కి శత్రు సైన్యములగూల్చి దైన్యమొందఁ జేసెను. ఒండొకయెడఁ గర్ణుండు మధ్యందిన మార్తాండుని భాతివెలిఁగి, నిశితనిబిడ బాణకిరణంబులు ప్రసరింపఁజేయుచుఁ బరబలంబుల సమయింపుచుండ, నకులుఁడా తనిమార్కొని, వీరాలాపంబులాడి యుగ్రభంగిసంగర మొనరించి, తుదకు విరథుఁడై లజ్జ, విడిచి పాఱిపోయెను. కర్ణుండక్కుమారుం దఱిమి కుంతీదేవి పల్కులు దలఁచి వానింజంప నొల్లకనీచోక్తులనిందించి పల్కి విడిచెను.

ఆదినంబున సహదేవునితోఁ దలపడి దుశ్శాసనుఁడోడెను. కృపాచార్యుని మార్కొని ధృష్టద్యుమ్నుఁడు పలాయితు

డయ్యెను. ధర్మనందను నెదిరించి దుర్యోధనుఁడు పాఱెను. శకుని పుత్రుండగునులూకుపై గవిసి నీకొడుకుయుయుత్సుండు విరథుఁడై సమరవిముఖత్వమొందెను. అర్జునుండు త్రిగర్తసంశప్తక సైన్యములతో నత్యుగ్రముగా సంగ్రామమొనరించి, యనేకుల రూపడంచెను. అంతఁ బ్రొద్దుగ్రుంకి సంజయెఱుపుతోడి చీఁకట్లు గ్రమ్మిన, నుభయవాహినులు నిజస్కంధావారంబులకుఁ జనియె.

—: (2) శల్యుఁడు కర్ణునకు సారథియై యతని దూలం బల్కుట. :—

రాజేంద్రా! రెండవ నాఁటికయ్య మప్పుడు కర్ణుఁడు దుర్యోధనుం జూచి తనకంటె నెల్లవిధంబులఁ బార్థుండు హీనుండయ్యును, హరి సారథ్యముచే మిగులుచున్నవాఁడని తెల్పి, తనకు నశ్వతత్వవేదియగు శల్యుని సారథిగాఁ జేసిన లెస్సయగునని యెఱింగించిన, రారాజప్పుడే శల్యుపాలికింజని, సవినయంబుగా నతనిఁ గర్ణునకు సారథ్యమొనరించి తన్మురణంబులో గెలిపింప వలయునని ప్రార్థించెను. గాని కాతఁడు నీచుఁడగు సూతకుల ప్రసూతుని కెంగై నను భూతల పతులు పనిసేయుటొప్పునాయని మొదటఁ గోపించి పలికెను. సుయోధనుఁడా మద్రపతిని సారథ్యవిషయమందును, హయ హృదయ వేదిత్వంబునందును, నంద నందనుని కంటె నెక్కుడైన వానిగాఁ గొనియాడి, పూర్వము త్రిపురాసురులపైఁ గడంగిన హరునకు సారథ్యమొనరించిన విరించిపగిది, నర్జునునిపై నెత్తిన కర్ణునకు సారథ్యమొనరించుట మిక్కిలి తగునని సంప్రార్థించెను. కురుపతి కోర్కితీర్చుట యొప్పునని తలఁచి యాశల్యుఁడు

క. "వీనులకుం బలుకులు నే
దైనను జెప్పుదు హితంబు లగుకార్యంబుల్
దానికి నోర్వంగవలయుం
గాని యలుకవలదు నీకుఁ గర్ణున కధిపా."

యని, సమయపూర్వకముగాఁ గర్ణుని తేరుగడపనియ్య కొనియెను. దుర్యోధనుఁడు సంతోషించి యంగపతి మద్రపతుల స్తుతియించి విజయునిజయించుటకై పూనుకొన నయ్యిరువుర నియమించెను.

కర్ణుఁడొక్క మహనీయంబగు రథంబుదెప్పించి, తగిన పూజా విధానంబులు దాని కాచరించి, ప్రదక్షిణంబుసేసి, సవినయంబుగా శల్యుని నొగలెక్కఁజేసి, తానును రథారూఢుండై రెండవ మార్తాండునివలె శోభిల్లెను. అంత బహువిధ తూర్యా రావములు మ్రోయ, శల్యసారథ్యంబున నొప్పుచుండు కర్ణుఁడు, తోడి దొరలతో నత్యుత్సాహంబున రణభూమికి నడవ, శల్యుఁడా తనియుత్సాహంబు సెఱుపనెంచి యతనితో నిట్లనియె. "కర్ణా! నీవు వీరోత్తముఁడగు పార్థుని నెదిరింపఁదలంచుట లేడిసిగంబుతోను, గుందేలేనుంగుతోను, నక్క బెబ్బులితోను, పాముగరుడునితోను బోరునట్లున్నది. ఖాండవమేర్చి, క్రీడాకిరాతుఁడైన పినాకినోర్చి, మత్స్యపతిపసులఁ బట్టిన కురు వీరులనెల్లఁ బిలుకుమార్చి గోవుల మరల్చినట్టి పార్థుఁడెక్కడ? నీవెక్కడ? నీవాతని నొంటిమై నెదిరించి యగ్గింబడఁ జొచ్చిన మిడతవలెఁ గాలిపోవవా? నాపల్కులు వినుము. నేను దుర్యోధనునకు హితము గోరువాఁడనై చెప్పెదను. నీవా జగదేక వీరుండును, వాసు దేవ సఖుండును నగు శతమఖ తనయుతో

నెక్కటికయ్యమునకుఁ బూనకుండుము. తగు వీరుల జంట గొని పోరుము. నీకొకదృష్టాంతము సెప్పెద వినుము. పూర్వ మొక కాకి యెంగిలి దిని కడు గ్రొవ్వి, తన్ను నెదిరి నెఱుఁగలేక, హంసతోఁ బురడించి, సముద్రము పైఁబఱచి భంగపడియె. నీవు నట్లే కురుకుమారుల యెంగిలి తిని. దుర్మదంబున పార్థునారాళంబున కెదిరింపఁ జూచెదవు. నీవు ప్రాణమైనఁ మానమైనఁ గోలుపోవుదువు. నామాటనిజము సుమ్ము''

అని యిట్లనేక ప్రకారంబుల నామద్రపతి యద్రిభేదిసుతుం బొగడి, సూతసుతుం దెగడి వెగడుపడునట్లు బెడిదంబులువల్కిన, రాధేయుఁడు విని శల్యునిపైఁ గోపించి యిట్లనియె. ''ఓరీ! నీవు గుణహీనుండవు. అతికుటిల స్వభావుండవు. క్షత్రియాధముఁడవు. మిత్రవంచకుండవు. నేనునిన్ను నాకును బార్థునకును గల తారతమ్య విశేషంబు లెఱింగింపుమని కోరితినా? ఏల వానివందిజనమువలెఁ బొగడెదవు? నీపిఱికి మాటలచే నన్ను వెఱపింపఁ జూచితివా? నేనుగీర్తికిని విక్రమంబునకును బుట్టిన ధైర్యార్ణవుండగు కర్ణుండ సుమ్ము పారుని బలిమియు, గృష్ణుని పెంపును నెఱుఁగుదు. వారికి వెఱవను. నాప్రాణంబుల పోవను వెఱవను. నాగురుని శాపమునకును విప్రుని కీడుపల్కులకును వెఱతును. నేను బ్రాహ్మణుఁడనని బొంకి జామదగ్న్యుచే బ్రహ్మాస్త్రంబు గొంటిని. దానికాతఁడు నాకాయస్త్రంబు నిరుపయోగమై చెల్లుగాకయని శపించి,మృత్యువు బొందనున్నప్పుడది తోఁచుగావుతమనియెను. ఒకవిప్రుని హోమధేనువత్సమును దెలియక చంపిన దానికాపాఱుఁడు రణంబునప్పుడు నా తేరు నేలఁ గ్రుంగిపోవునట్లు క్రూరుఁడై శపించెను. కావున శల్యా! నే నా

రెండు తిట్టులకు నులుకుదునుగాని, వేయిపార్థులు వచ్చినను, బది
వేలు కృష్ణులు వచ్చినను నేనుసరకు గొనను సుమ్ము. నీవువట్టి
మాటలనన్నుఁ బేలఁజేయఁ జూడకుము. నారణంబును, బీరం
బును, లావును జేవయుగని, తర్వాత నీకు వచ్చినట్లు ప్రేలుము.
నాకు హితంబు సెప్పువానివలెఁ గష్టాత్ముండగు నీవు, నన్ను ని
కృష్టపుకాకిగాను, పార్థుని ను త్కృష్టహంసముగాను జేసి దృష్టాం
తము సెప్పితివి. ఇది మిత్రుని తెఱగా? నీవు సాగధ్యమునకుఁ
బూనునప్పుడాడిన బాసచే బ్రదికితివి; లేని చో నిన్నుఁగూల్చి
యుండనా? చాలునీపల్కులు, వేగంబరథంబు బోనిమ్ము"

మద్రపతియప్పుడు కర్ణుఁడు మనంబులోఁ గలఁగినట్లు
నిశ్చయించి, తాను ధర్మనందనునకిచ్చి న వరముసఫలమయ్యెనని
తలఁచి సంతోషించెను. దుర్యోధనుఁడు వారలసంవాదంబుడిపి
యిరువురను దేర్చెను. అంతట రణభూమి సమీపించిరి.

### (3) పాండవ కౌరవ వీరుల ద్వంద్వయుద్ధము! యుధిష్ఠిర పలాయనము.

సుయోధనుఁడప్పుడు యోధులతో మాధవులతోఁడి పాం
డవుల గెల్చిన రాజ్య మనుభవింప వచ్చుననియు, వారిచేఁ
గూలిన నాకలోక సౌఖ్యములు భోగింప వచ్చుననియుఁ జెప్పి,
యందఱకు నాహవప్రోత్సాహము గలిగించెను. అశ్వత్థామ
గురుద్రోహియగు ధృష్టద్యుమ్నునిం జంపికాని తన కత్తళంబు
వుచ్చునాఁడ గాఁడనియె. భూపతీ! నాఁటియుద్ధము రౌద్రమే
మని చెప్పుదును? పార్థుఁడు సంశప్తక వీరులతో నొక్కెడఁ
బోరుచుండెను. వేఱొక్కెడ భీముఁడు కర్ణుని పుత్రులైన సత్య
సేన సుషేణులతోఁ బోరుచు వారి పేర్మి సెఱచి పేర్చి, కౌరవ

సైన్య గజంబులగదా ప్రహారంబుల రూపుసెఱిచెను. సుషే ణుండును నృపసేనుండును చంద్రికి సహాయులై పాండవసేనల నేలకుం గోలకుం దెచ్చుచుండిరి. కర్ణుడు భీమ ధృష్టద్యుమ్న సాత్యకి ప్రభృతుల నిశితాస్త్రంబుల నొప్పించి విముఖులుగాఁ జేసి ధర్మపుత్రుపైఁగవిసి యతని మునవాలమ్ములు గ్రుచ్చి తేరు నారథిం ద్రెళ్లనేసిన, నాపాండవాగ్రజుఁడు రథంబు దోలుకొనిపో యెను అప్పుడు సూతతనయుఁడు నవ్వుచు నాతని వెంటనంటి,

సీ. "క్షత్రియకులమున జన్మించియిదిధర్మ
మిదియు ధర్మంబని యెల్ల నెఱిఁగి
నట్టి నీకిట్లు మహాహవమునఁ బ్రాణ
ములుడాఁచికొని శాత్రవులకుఁ దొలఁగి
పోవుటదగునెనీబుద్ధిగానఁగనయ్యె
నృప నీతియెఱుఁగవు నీవు బ్రాహ్మ
ణాచార వేదవిద్యాధ్యయనముల
వర్తింపు కయ్యంబు వలవదుడుగు
తే మింకననుబోఁటి దొరకిన నింతకంటె
నెడరువాటిల్లువేగపొ మ్మింటికడకు
హరియుఁబార్థుఁడునున్నెడ కైననరుగు
మేనుదెగ నీదుప్రాణాన కింతనిజము."

అని యవమానించి పల్కెనుగాని, యమ్మహాపురుషుఁడు కుంతీదేవిపల్కులు దలఁచి, యాతని ప్రాణములపైఁ దెగ కుండెను.

భీముఁడగ్రజునకైన పరిభవంబుగని క్రోధ పరవశుఁడై కర్ణునెదిరించి, యతనిమూర్ఛిల్లనేసి, చంద్రహాసంబు వెఱికి

నాలుకగోయఁడా సెను. శల్యుఁడాతని వారించి రథంబు మఱలిం చెను. రాధేయుఁడు నొచ్చుటంగని భీమునిపై దుర్యోధనుఁడు శ్రుతవర్మాది యార్వురు తమ్ములంబంపిన, నమ్మహాబలనందనుఁ డందఱ తలలునఱికెను. అంతలోఁ గర్ణుఁడు తెలిసి మఱియు భీమునిపై యుద్ధమునకుఁ బూనెను.

అర్జునుండక్కడ రవిమంచు మాయించినట్లు సంశప్త కుల నడఁగించి యశ్వత్థామ పైఁగవియ, నతండు కొంత తడవు నరునితోఁబోరి, కర్ణునితోఁబోరుచున్న ధృష్టద్యుమ్నుంగని,

క. "మాతండ్రియెడం జేసిన
పాతకము గతంబుగాఁగఁ బాంచాలని కృ
ష్టా! తుని మెదనినునరుఁడిట
యే తెరకయున్నఁ బాట కీవునిలిచినన్."

అవి యదల్చిన, వాఁడును.

క. "మీతండ్రి కుఱికినఱికిన
హేతియ నీకొఱకునునిచి తిపుడనఱకుదున్
నీతులువ పలుకులకు నీ
జ్జైతోఁచినయుత్తరంబు నదియెపురాత్మా"

. అని మాఱుగాఁ బరుసంబులాడి గురుపుత్రు విల్లుద్రుం చిన, వాఁడొండొక విల్లుగైకొని ధృష్టద్యుమ్నుని సూతతురగ స్యందన కేతన చాపములు నఱికి, వాలు చేఁబూని, లేచిపై నడరు సింగంబుచందంబున నతనియు సురులు గొనఁబోయిన, హరిచే దాని నెఱిఁగిన పార్థుఁడప్పుడు, నడుమసొచ్చి తన యగ్రసేనా పతింగాచెను

కర్ణుఁడు బలంబును జలంబును మెఱయ ననేక శత్రు వీరులం బొరిగొని, పాండవయోధాగ్రేసరులగు భీమసాత్యకి ధృష్టద్యుమ్నాదుల నోడించి, ధర్మపుత్రుపై మఱియు ని శితాస్త్రములేసి నొప్పించిన, నతండు సహదేవుని తేరెక్కి భయభ్రాంతుఁడై రణభూమివిడిచి తన శిబిరంబునకుఁ బోయెను. కర్ణుం డంతలో భీము బారింబడి మహాపదలో మునిఁగిన రారాజు నుద్ధరింపఁబోయెను.''

—: (4) కర్ణునింజంపునట్లు ధర్మరాజున కర్జునుఁడు బాసయిచ్చుట. :—

రాజేంద్రా! ధృతరాష్ట్రుఁడు యుధిష్ఠిర పలాయనము విని, కర్ణుఁడట్లాతనిం జంపక విడుచుటకు వగచినవాఁడై యవ్వలి చివ్వ తెఱంగు వినఁగోరి సంజయునడుగ, నాతఁడారాజున కిట్లనియె. ''ధర్మపుత్రుఁడు శిబిరంబుసొచ్చి సెజ్జపై మేనువైచి, దుర్జయుండగు కర్ణుని బాహువీర్య శౌర్యాదిగుణంబులు దలపోయుచు, నతనిచే భంగమొందిన దానికి విషాదమొందియుండెను. కర్ణుఁడక్కడ యక్కమిగిలి యక్కజంబగు భంగిఁబెక్కు వీరులతోఁ బోరుసల్పుచు భార్గవాస్త్ర ప్రయోగమునఁ బాండవ సేనల రూపుమాపుచుండ, నాతని దుస్సహ తేజోమూర్తిని ధనంజయుఁడు గనుంగొని, యప్పుడాతనితోఁ దలపడినఁ జావగు నని వెఱచి కృష్ణునితో ధర్మనందనుని జూడఁబోయెను. కర్ణునిఁ జంపకవచ్చిన పార్థుని ధర్మరాజుకినిసిపలికి యతనిచేతి గాండివ మొరున కిచ్చునట్లు చెప్పెను. అర్జునుఁడట్లు తన్నుఁబల్కువారిని జంపువాఁడై ప్రతిన బూనినవాఁడగుటచే, నన్నంజంప నొరలో నుండి వాలు వెఱికెను. కృష్ణుఁడాతని వారించి గురుని నిందిం

చుటయుఁ జాపుటయు నొక్క పాపగుట యెఱింగించి ధర్మ రాజును నిందింప నియోగించిన, నాతఁడట్లే చేసి పశ్చాత్తాపతప్తుఁడై, యాత్మహత్య యొనరించుకొన మఱియుఁ గత్తి యెత్తెను. వానిని వాసుదేవుఁడు మఱియు వారించి యాత్మస్తుతియొనరించునట్లు నియోగించెను. అప్పుడర్జునుఁడు ఖాండవదహనాది నిజవీర కర్మములు చేర్కొని, తన్ను నగ్రజుకంటె గొప్పగా నిరూపించి పలికి, శోకసంతప్తుఁడై యన్నకాళ్లపైఁబడి తన్ను మన్నించునట్లు ప్రార్థించెను. ధర్మరాజాతని దిగిచి కౌఁగిలించుకొని శిరంబుమూర్కొని "తమ్ముడా! మనలఁ గర్ణుఁ డింతవఱచునా? నీవాతనిం జంపకున్న నాకెట్లు బ్రతుకఁ బోలు?" ననియె. పార్థుఁడు కర్ణునిం జంపునట్లు ప్రతిజ్ఞ సేసి, యన్నకు మ్రొక్కి దీవనలునడసి, కృష్ణుని పల్కులఁ జిత్తంబు గలంకదేఱి, యుద్ధరంగమునకు మగిడివచ్చి, శత్రువులతో శ్రమం బడరఁబోరుచున్న మారుతికి ధర్మరాజు క్షేమమెఱింగించి, కర్ణవధకై పూనుకొనెను.

## (5) భీముఁడు దుశ్శాసనుంజంపి యతని యురము వ్రచ్చి నెత్తురు ద్రావుట.

రాజేంద్రా! వినుము. అప్పుడు యుద్ధరంగములో నిరువాగు దొరలును విమచ్చరులు మెచ్చ మచ్చరంబున నొండొరులతోఁ బోరాడుచుండ, నందఱకుఁ దలకడచి యువరాజగు దుశ్శాసనుఁడు భీమసేనుపై నడరి, శితప్రదరంబుల నాతని నొప్పించెను. వాయుపుత్రుఁడు దానికి ప్రమోదమొంది యువరాజుంజూచి,

ఉ. "ఆసభలోనఁ గొన్న ఋణమంతయు నీఁగఁగఁగంటి వడ్డితో
బాసకొకింతయుం దొలఁగఁబాఱకు, తీర్చెదనిప్డునేఁడు, నా
చేసినపుణ్య మెవ్వరును జేయరు, నిన్నిటు నేరఁదెచ్చుటం
జేసివిధాతనాకుఁ గృపసేయుటఁ గానఁగవచ్చెఁ దమ్ముఁడా"

అని యతని దుశ్చరిత్రంబు లెల్ల నుగ్గడించి, మహోగ్ర
కోపనుఁడై యతని మేనవాడి తూపులునించెను. పరస్పర బాణ
ముల నయ్యిరువురు విరథులైరి. దుశ్శాసనుఁడు దోమరంబుగొని
నేల కుఱికిదాని భీముని యురంబుపై వైచెను. వాఁడు తనచేతి
గదాయుధముచే నాతని మూర్ఛిల్లఁజేసి, కదిసి బిట్టడిచి మెడ
దొక్కిచంపి,

మ. నరసింహుండసురేంద్రు వ్రచ్చుకరణి న్రౌద్రంబుదగ్రంబుగా
నురమత్యుగ్రతఁజీరి క్రమ్మురుధిరమ్ముల్లాసి మైదోయిట
న్వెరవారంగొనిత్రావు మెచ్చుజవికిన్నేర్తుణ మొగంబున్ భయం
కరరేఖం బొరయంగఁజల్లి కొనునన్నాఁకవ్యుఁజూచున్ బొరిన్.

భీమసేనుఁడట్లు యువరాజగు దుశ్శాసనునింజంపి వక్షం
బుగీరి నెత్తురు ద్రావుటంజూచి కౌరవసేనలును, దుర్యోధన కర్ణ
కృపాచార్యులాదివీరులును వెఱగంది ఱిచ్చవడియుండిరి. పార్థుఁ
డట్లు భీముఁడు తన ప్రతిజ్ఞను నెరవేర్చుటకు సంతోషమంది
యుండెను. అంత భీముఁడెలుంగెత్తి కౌరవు లెల్లవిన,

క. "వినుమేను జేయఁబూనిన
పనులందొకటి గడతేఱె, బాపాత్ముసుయో
ధనుఁబొరిగొని తలదన్నుదు
ననురెండవ పనియుఁదీర్ప నరిగెద నెలమిన్."

అని సింహనాదము గావించెను. అప్పుడాతనిపైc బదువురు కురుకుమారు లొక్కటై కవిసి నిశాత బాణములేయ, వారిం గనుంగొను చుండిన పార్థుcడు భల్లదళకంబున వారితలలు భూమికి బలిసేసెను. కౌరవసైన్యము లెల్లcబఱచి కర్ణుని మఱువు సొచ్చెను. యువరాజు చావుగని వెఱగుపడి చేష్టలుదక్కి యుండిన కర్ణుండును శల్యునిచే బోధింపcబడి సమరోన్ముఖుం డయ్యెను.

## (6) అర్జునుcడు వృషసేనకర్ణులం జంపుట.

కర్ణునికొడుకు వృషసేనుం డుగ్రముగా భీమసేనుపై నడర నాతనికిముందుగా ధృష్టద్యుమ్న ద్రౌపదేయాదు లెల్ల వచ్చి వృషసేనునిం దాcకిరి. వానికి బాసటయై కృపాశ్వత్థామ దుర్యోధనశకునులు వచ్చిరి. అప్పటిపోరు భరమైయుండెను. వృషసేనుcడు దనచే నోపినంత పోరుచుండcగ బార్థునిచేc దల దునుమcబడెను. కొడుకు చావునుగని కర్ణుcడు రోషశోకావేశంబులుగొని పార్థునిపైcగవిసి ఘోరముగా రణ మొనర్చుచుండ, నాకర్ణార్జునుల యసమసమర దర్శనోత్సుకులై దేవతలాకాశమునం గూడి తమలో జయాపజయ విషయమై సంవాదము సేయుచు, నరనారాయణాంశ జనితులైన విజయవాసు దేవులకు జయంబగుcగాక యనియు, సూతపుత్రునకు భీష్మ ద్రోణాదులకైన పుణ్యలోక వాసంబుగలుగ గాక యనియు దీవించిరి.

వీరాగ్రేసరులగు వసుసూతనందను లొండొరులపై దివ్యాస్త్రములేయుచు నుగ్రముగా సంగ్రామ మొనరించుచుండను రెండు పక్షములనున్న క్షత్రియవీరులును సైన్యములును గనుం

గొనుచుండిరి. కర్ణుఁడు దీర్ఘక్రోధుఁడై మాధవధనంజయుల నిశితబాణజాలముల నొప్పించినఁ, గృష్ణుఁడు సమయోచితంబు లగు వాక్యముల నరుని కోపంబు దీపింపఁజేసి కర్ణుంజంపునట్లు పురికొల్పెను. అప్పుడు పార్థుఁడు గర్ణునిపై బ్రహ్మాస్త్రమేయ, వాఁడును మాఱుగా దానినేయేసి పార్థుని బలిమి సెఱచి, యతని మేన వాలమ్ములు గ్రుచ్చెను. ఆరథికవరు లిరువురు నెక్కువశ్ర మపడియున్నను, నెత్తుటఁ దోఁగుచుఁ బూచిన బూరువులవలె నొప్పుచు, బలంబును, జలంబును మెఱయ వేల్పులగ్గించు తెఱంగునఁ బోరుచుండిరి.

అంతఁగర్ణుఁడు పార్థుని ప్రాణంబులు గొననెంచి, పసిండి యొరలోనుండి తనచేఁ బ్రతిదినము నర్చితంబగుచుండు నట్టి యశ్వసేనాభిధానమైన సర్పాస్త్రమును గుణంబులో సంధించి శత్రుకంఠస్థలంబు సూచియేసిన, నదిభయంకర విషాగ్ని జ్వాలలు గ్రక్కుచు వచ్చుటను జూచి, పార్థసారథి తనరథమును భూమిలో నైదంగుళములు దిగునట్లదిమెను. ఆపాఁపరమ్మ పార్థుని కిరీటమును భేదించి దానినేలం బడవైచి, పొనుగు పడు నట్లు కాల్చి, మఱియుఁ బూర్వవైరంబు దలఁచి యర్జునునిపైఁ గవిసిన, భార్గరక్షకుఁడగు పుండరీకాక్షుఁడా పాముచరిత్రం బాతనికిజెప్పి యతనిచే దానిఁ జంపించెను.

కర్ణుఁడు తన సర్పశరమట్లు వృథయగుటను విస్మయం బును శోకంబును బొందుచు, నందనందన వాసవనందనులపై ననేక క్రూరాస్త్రములేసి నొప్పించుచుండగా, నప్పుడు కాల పురుషుఁడదృశ్యుఁడై యాకాశమున నుండి

క. "భూసుర శాపంబున నిదె
యీసూతజురథము చక్రమిలఁ గ్రుంగెడు, పీ
తాసుఁడగు నీతఁడనిసే
నాసము దయయుగ్మకము వినంబలికె నృపా."

కర్ణునకు మృత్యువాసన్న మగుటచే భార్గవాస్త్రము ప్రతిభాసింపకుండెను. అతని తేరు చక్రము భూమిలోఁ జొరఁబడి బాణము వేయుటకు విఘ్నముగలుగఁ జేసెను. జాగదగ్న్య భూసురశాపంబులు దన్ను బాధించుటకు రాధేయుఁడు విషాద మొందినను రోషముడింపక, యాశీవిషంబులుం బోని బాణములు నరునిపై నేయసమకట్టిన, మఱియు రథచక్రము ముందు కంటె నెక్కువఁగాఁ గ్రుంగి యమ్ము లేయుటకు ననువుగా కుండునట్లు చేసెను. కర్ణుఁడప్పుడు తేరుడిగ్గి యర్జునుంజూచి విరథుఁడగు తనపై బాణము లేయకుండుట రణధర్మమగుఁగని పలికెను.

కృష్ణుఁడదివిని "ఏమీకర్ణా! నీకుఁదగవును ధర్మమును, నేఁడేమనంబులోఁ దోఁచెనా? ధర్మస్వరూపులగు పాండవేయులకు శుభమును, ధర్మహీనులైన ధార్తరాష్ట్రులకుఁ గీడును గలుటరుదా? లక్కయిల్లుగాల్చునపుడును, గపటవుజూద మున సిరిగొని నప్పుడును, పాంచాలి:సభలోని కీడ్చునపుడును, బాలుఁడగు నభిమన్యుని వధించు నప్పుడును, నీవిప్పుడు చెప్పు పాడి యేమయ్యె?" నని కర్ణునితోఁ బల్కుచుండ, నంతకంతకుఁ బార్థునకు రోషంబుజనించి, క్రూరాస్త్రములచే విడువక సూత తనయుని నొప్పించుచుండెను. కర్ణుఁడు పీడితుఁడైనను వెను దీయక క్రీడిపైఁ గఱకుటమ్ము లేసియతని వెగడు పఱిచి, తన

చేతి బల్మిచే రథచక్రమెత్తిన, నది వైకిరాకయే భూమితో నాలుంగుళములు లేచెను. అంత నవ్వీరుఁడు తేరెక్కియుక్కుమిగిలి యెప్పటి బాణమేయఁ జూచిన, మఱియు నతని రథచక్రము క్రుంగెను. అతఁడు మఱియు రథావతరణము చేసి చక్రమెత్తుచుండఁ, గృష్ణుని యుపదేశమున నర్జునుఁడు కర్ణుని తల నొకపటుభల్లమున డొల్ల నేసెను. వజ్రాహతిం గూలిన శైలమోయన నాకర్ణుని యట్టునెత్తుటఁ దోఁగుచుఁబుడమిపైఁ బడియె. అంతనాతని దేహమునుండి తేజము వెల్వడియుందఱుఁ జూచుచుండ రవిబింబము సొచ్చెను. సూర్యుఁడును గొడుకు చావుఁ జూడలేక విషాదముతోఁ దొలంగి పావనస్నానమాచరింపఁ బోవువానిపగిదిఁబడమటి మున్నీటిలోఁ గ్రుంకెను.

రాజేంద్రా! కర్ణుని చావుసూచి పాంచాలాది వీరులును బాండవసేనలును మహోత్సాహంబున నార్చిరి. శల్యుఁడు దీనవదనుఁడై, కర్ణమరణానంతర మిలదిగక యెప్పటియట్ల భూమిపైనున్న తన తేరునుద్రిప్పి, శోకసాగరమున మునింగిన దుర్యోధన కృపాశ్వత్థామలం గూడుకొనియె. కౌరవులు దీనవదనులై తమశిబిరంబునకుఁ బోవుభంగిఁజూడ, నాఁడు జూదమున నోడిన పాండుపుత్రులడవికిఁ జనునట్లుండెను.

పాండవసేనలు నరనారాయణుల విక్రమంబులు వొగడుచుఁ దమవిడిదలకుఁ జనెను. ధర్మరాజు తనయొద్దకు వినీతులై వచ్చిన కృష్ణార్జునుల నాలింగనంబు సేసికొని, వారి విక్రమము పొగడి, కృష్ణుంజూచి "మహాత్మా! నీకూర్మికిఁ బాత్రులమగు మాకు శత్రుజయంబు గల్గకుండునా? సత్యసంకల్పుఁడవగు నీవు దలంచిన పని నెఱవేఱ కుండుటెట్లు? శ్రీధరా! మాధవా!

ఆ. అఖిల రక్షకుండవగు నీవు భక్తుల
పైన మమ్ముఁ గాచుటరుదె తలఁప?
భయము నెవ్వగయును బాసినాకంటికి
నిదుర వచ్చె నేఁడు నీరజాక్ష."

అని నానాప్రకారంబులఁ బుణ్యశ్లోకుండైన దేవకీ తనయునితో సల్లాపమొనరించి, యారాత్రి కృష్ణసోదరాది సమస్తబంధుజనులతోఁ బాలికలనికిఁ బోయియందుఁ బీనుంగులై పడిన కర్ణకర్ణపుత్రాదుల తలలను మేనులునుగని, తన్నప్పుడు మరల జనించినవానినిగఁ దలంచుచు, సకలమేదినీరాజ్యంబు సమకూరినట్లు సంతోషమొందుచు మరలి శిబిరంబునకువచ్చెను.

ఇది కర్ణవరకథా సంగ్రహము.





శుభమస్తు.

# బాలభారతము.

## IX. శల్యపర్వము.



### (1) పదునెనిమిదవనాఁటి యుద్ధము; శల్యుఁడు ధర్మనందనునిచేఁ బడుట.

వైశంపాయనుఁడు జనమేజయునకిట్లనియె.

"అట్లు కర్ణుని చావుఁ దెల్పిన తర్వాత సంజయుఁడు మఱియు యుద్ధరంగమునకువచ్చి పదునెనిమిదవనాఁటి సమర ప్రకారంబంతయుఁజూచి మఱునాఁ డుదయము మగిడి కరిపురికిఁ జని, ధృతరాష్ట్ర భూవిభుంగని డగ్గుత్తిక వెట్టుచు నిట్లనియె. "దేవా! శల్యశకున్యులూకత్రిగర్తవిభులాది భూపాలురెల్ల నేలం గలిసిరి. దుర్యోధనుండును బ్రొద్దువ్రాలి నప్పుడు భీమసేనునిగదా దండముచేఁ దొడలువిఱిగి సోలి నేలపై వ్రాలియుండ నాతనికిం బ్రియంబుగా నారాత్రి యశ్వత్థామ పాండవశిబిరంబు సొచ్చియందు నిద్రించుచుండిన సకల పాంచాలకుమారులను, ద్రౌపదేయులను మృత్యుగోచరులగునట్లు గావించి, యవ్విధంబంతయు రారాజునకుఁ జెప్పి, యతని చావు గనుంగొని చనియెను. కౌరవపక్షమునఁ గృపాశ్వత్థామ కృతవర్మలును,

పాండవపక్షమున వాసుదేవ సాత్యకులును, పాండవులేవురును భవద్వైశ్యాపుత్రుండగు యుయుత్సుండును బ్రదికిరి. తక్కిన వారెల్ల మడిసిరి."

ధృతరాష్ట్రుఁడు మూర్ఛిల్లి కొంతవడికిఁ బ్రజ్ఞాన్వితుఁడై సంజయుం గనుంగొని,

క. "చావరు నోవ్వరు పాండవు
లేవురునని నీవు చెప్ప నిప్పలుకులు దుః
ఖావేశకరము లై చే
తో వృత్తిదహింపఁజొచ్చె దుర్భర భంగిన్."

అని పాండవులు సమికిం దుర్యోధనాదులు నూర్వురు మడియుటకును దద్దయువగచి, రణప్రకారం బెఱింగించునట్లు వేఁడిన వాసూతపుత్రుఁడాతని కిట్లనియె.

"రాజేంద్రా! కర్ణుని మరణానంతరము కృపాచార్యుఁడా రాత్రియే నిజసైన్య శ్రాంతభావంబును, శాత్రవసైన్యోత్సాహంబును గనుఁగొని రారాజుం జేరవచ్చి యతనితో,

క. తమకు బలంబెక్కిన తఱి
సముచితమగు విగ్రహంబు శత్రుల కుత్సా
హము మీఱినపుడు కర్త
వ్యము సంధియనంగవిందు మార్యులచేతన్."

అనిపల్కి, సత్పురుషులగు పాండవులతోఁ గూడి, యున్న వారితోనైన బ్రదుకున ట్లుపదేశించెను. దుర్యోధనుఁ డప్పల్కులు విననొల్లక, తనకింక నొకనిదయచేఁగల్గు రాజ్యసుఖము లింపుసేయ నోపవని చెప్పి. ప్రతాపంబును గీర్తియును శోభిల్ల

వైరులతోఁ బోరి గెల్పుటాండె, వారిచేఁ గూలుటాండెఁ బోలు కార్యమగునని నిశ్చయించి,యుందఱకురణోత్సాహము వాటిల్లఁ జేసి, మద్రపతియగు శల్యుని నిజచమూపతిగానుండ వేఁడుకొనిన, నాతఁడియ్యకొని పట్టముదాల్చి రాజున కిట్లనియె.

చ. అతిముఖ బాణజాలముల నక్కడి సైనికులం దెరల్చెదం
గులుకొని నాకు మారుకొని కోల్తలఁ జేసిన వీరవర్గముల్
నతికెరఁజూచు ఖేచరగణంబుల కచ్చెరు పాటొనర్చెదన్
బలుపెదఁ బాండునందనులఁ బాలిక నిల్చినరూపడంచెదన్.

ఆరాత్రియట ధర్మరాజు కౌరవసైన్యంబు శల్యాయత్తమై పేర్చియుండుటను విని కృష్ణమూర్తితో విన్నవించిన, సర్వజ్ఞుండగు నమ్మహాపురుషుఁ డజాతశత్రునితో శల్యుండు దర్పితవైరి హృదయ శల్యుండనియు, భీష్మద్రోణకర్ణాదులకెన వచ్చునాఁడనియు, భీమపార్థధృష్టద్యుమ్న సాత్యకులకునజయ్యుఁడనియుఁజెప్పి, యాంబల్లిమంగూల్ప నాతఁడొక్కండ యోపునని యు నెఱింగించి,

ఆ. "అతఁడు మేనమామయను కృపదక్కము
రాజ ధర్మమును బురస్కరించి
యతుల విక్రమక్రియాపాటవంబున
నవ్విరోధి నాను మడఁపవలయు."

అనిన, ధర్మనందనుఁడు శల్యుని వధించుట కియ్యకొనెను.

ధృతరాష్ట్రభూపతీ! రెండు సైన్యములును సూర్యోదయ సమయంబున యుద్ధసన్నద్ధమై వెడలి సంకులముగాఁ బోరునెడ,

క. అరదంబులు నరదంబులఁ
గరులుగరుల హరులుహరులఁ గాల్వురు మఱి గా
ల్వురఁదాఁకి పెనంగెడు భీ
కరభంగులు మెచ్చు దేరె గగనచరులకున్.

సమరరంగమంతయు నిమిషమాత్రమున రుధిరప్రవాహంబులచే నిండెను. శల్యుఁడు రౌద్రమూర్తి శోభిల్లఁబాండవానీకములంజించి చెండాడుచుండ, నాతని భీముఁడెదిరించెను. అయ్యిరువురగదాయుద్ధము చూపఱకాశ్చర్య సంపాదియయ్యెను. పరస్పర గదాహతిచే నిరువురు మూర్ఛితులైన శల్యునిఁ గృపాచార్యుఁడు తనరథంబుపైఁ గొనిపోయెను. భీముఁడంతలోఁ దెప్పిఱిలేచి మఱియు నామద్రపతిం బేర్కొనిపిలిచిన నాతని గర్వమునకు సహింపక రారాజు పడముడిపైనడరెను. అప్పుడు భీమసేనునకుం దలకడచి చేకితానుఁడువచ్చి రారాజునెదిరించి యతనిచే హతుఁడయ్యెను. నకులుఁడు కర్ణపుత్రులగు సత్యసేన చిత్రసేన సుకర్ములను మువ్వురం ద్రెళ్లనేసెను. త్రిగర్తబలంబుల సాహాయ్యమున నశ్వత్థామ వేఱొక్కెడరభసంబుగాఁ బోరాడుచుఁ బాండవబలముల క్షీణింపఁ జేయుచుండెను.

శల్యుఁడు విజృంభించి యత్యద్భుత విక్రమంబు దీపింప, శాత్రవ చమూసాగరంబున మందరగిరి మాడ్కి బహువిధ చిత్రగతుల సంచరించుచుఁ జతురంగ బలంబులనెల్ల సమయించుచున్న, నతని తాఁకున కోర్వక యందఱు వెఱచఱచి పఱచిరి. ధర్మరాజు సేనలమరల్చి పోరికిఁబురికొల్పి మేనమామపైను ద్దామగతింగవియ, నయ్యిరువురకు నందందుఁగల వీర వర్యులు సహాయులై సమరవిహారంబు సల్పిరి.

క. పులులు దలపడిన యుబ్బున
బలుపునఁ దోఁపంగ మద్రపతిధర్మసుతుల్
తలపడి రొండొరువులపై
నలఘుప్రదరములు వఱపి రధికరయమునన్.

పరస్పర సాయకచయముల శల్యధర్మనందనులు విరథు లయ్యు, నొచ్చియు, సోలియు, వ్రాలియు, సమగ్రధైర్యధుర్యులై పోరాడుచుండ, మద్రపతి దుర్దమప్రతాపశౌర్య భుజబలంబు లవార్యంబగుటకు ధర్మరాజు తలఁకినను, కృష్ణుని పల్కులు దలఁచి శల్యుంగూల్చుటకై యతనిపైఁ దనకు శివుఁడిచ్చిన శక్తిని వైచెను. ఆ ఘోరసాధనము పగతుని కత్తళంబుదూఱి, ఱొమ్ము సొచ్చి వెన్ను వెడలి పుడమిఁ జొచ్చెను. అప్పుడు దంభోళిచేఁగూలిన మహాద్రియో యన మద్రేశ్వరుఁడు తద్రణావనిం బడియెను. అంత నాతని చుట్టంబులైన వీరు లొక్కపెట్టున ధర్మపుత్రుపై నడరినిప్పులోఁ జొచ్చినమిడుతలవలె నణఁగిపోయిరి. పాండవసైనికులు ధర్మనందనుని పరాక్రమమును బహువిధంబులం గొనియాడిరి. కౌరవసైన్యములు దైన్యమొంది పఱచెను.

## (2) దుర్యోధనుఁ డేకాకియై పలాయితుఁడగుట

రాజేంద్రా వింటే? శల్యుండు సమసినను రారాజు పిఱికిగాక ధీరత వాటించి, పోటునకోహటించి సాలుసేనల కడ్డపడి యెలుంగెత్తి వారలతో,

ఉ. "ఎక్కడఁ బోవనచ్చు, గిరు
లేనియుఁ గాననభూములైనఁ దో
నెక్కియుఁ జొచ్చియుం, బగతు
రే త్తెఱఁగిట్టి చలంబునం దలల్

ద్రోకకతక, రట్లయిన దుర్గతి
వాటిలుఁ బోకనిల్చి పే
రుకనఁబోరినన్ సుగతి యొందెను
సంపదయొందెఁ జొప్పడున్."

అని ధీరోక్తులచందఁబును మరల్చి, పొంగారిపై వచ్చు పాండవసేనా సముద్రమునకుఁ జెలియలికట్టయై పోలిచెను.

భీమ పార్థులు కౌరవబలములను నిరవశేషంబుగాఁ జంపఁబూనిరి. శకుని గుఱ్ఱపుదండములంగొని సహదేవునితోఁ బోరెను. సాల్వుఁడు మదపుటేనుఁగునెక్కి పాండవబలముల మర్దింపుచున్న ధృష్టద్యుమ్న సాత్యకు లిరువురు వానింగూల్చి తమసైన్యముల గక్షించిరి. భీముఁ డుగ్రావహకేళీ వినోదియై రారాజు దక్క మిగిలిన కురుకుమారుల నెల్లఁ గూల్చెను. అర్జునుఁడు గాంధారవీరులగు నాశ్వికనికరంబుల రూపడంగఁజేసి, త్రిగర్తపతియగు సుశర్మను ససైన్యముగా యమపురంబున కనిచి వుచ్చెను.

సహదేవుఁ డక్కడ దుర్యోధన సహాయుఁడై పోరుచున్న శకునిచే నొచ్చినను, జలముడింపక పోరాడుచు నడ్డపడిన యులూకుం గెలుకుమార్చి, పుత్రశోకాతురుండగు శకునిపైఁ గ్రూరాస్త్రము లేసి, యతని విల్లునుద్రుంచి, రథరథ్య సారథులం బడవైచిన నాగాంధారపతి సిగ్గటిపాటెను. దానింగని దుర్యోధనుఁడు దీనవదనుఁడయ్యెను; పాండుపుత్రులు హర్షించిరి. అర్జునుఁడు గృష్ణమూర్తింజూచి "పాపాత్ముఁడగు నీదుర్యోధనుఁ డెంత మూర్ఖుఁడో! భీష్ముని పాటును, ద్రోణుని చావును, గర్ణుని మరణంబును, శల్యుని పంచత్వంబును జూచిచూచి, రాజ్యంబు

పాలియ్యనొల్లక రణంబునకు మఱియుఁ బూనెనుగదా ? యని పల్కుచుండెను.

కురునాథా ! నీమఱఁదిని మాద్రిపిన్నకొడుకు వెంబడించి "మామా! పాఱకనిలువుము, నీకెక్కడకుఁబోవచ్చు ? నీమాయపుజూదనుచే నంతపుట్టెనో చూచితివా? మీయవివేకులెల్ల మడిసిరిగదా? పాపిష్ఠుఁడగు రారాజున్నవాఁడు. అతండు నూడనీ తలగొనియెద"నని యతనిపైని ప్రచండకాండములు నఱపిన, గాంధారేశ్వరుఁ డామాద్రేయునిపై శక్తివైచెను. అక్కుమారుఁడు శక్తిందునిమి యొక్కపటుభల్లమునఁ దనమామతల ద్రొల్లసేసెను. కురుకులక్షయమునకు మూలమైన సౌబలుండు పడుటనుజూచి సంతోషించి ధర్మతనయాదులెల్ల శంఖధ్వానంబు గావించిరి. కృష్ణుఁడు పాంచజన్య మొత్తెను. అప్పుడు శకుని చుట్టములు కోపించి సహదేవుని పైఁబడిన నమ్మూకల నెల్ల భీమార్జునులు నిర్మూలంబు గావించిరి.

దుర్యోధనుఁడు శోకార్తుఁడయ్యును జలంబు విడువక, హతశేషములైన నిజబలంబులం గూర్చుకొని పార్థునిపై నడరిన, నవ్వీరుఁడు నవ్వుచు, నబ్బలములనెల్ల నిజమార్గణాగ్నికి నాహుతిసేసెను. కురుకులేశ్వరా ! ఏమనిచెప్పుదును ? నీకొడుకప్పుడు తనచుట్టును బయలగుటంగని, కట్టెదురనున్న పాండవులం జూడలేక, గుఱ్ఱముడిగ్గి గదాయుధపాణియై రణక్షోణివదలి యేకతంబుగాఁ బాదచారియై చనియెను. అతఁడు శకునిసేనలకు వెనుక నిల్చిన కృపకృతవర్మ గురుపుత్రులు మువ్వురుఁ బడకుండుట యెఱుంగడు. పాలికలనిలోనప్పుడు నీబలంబులు సూడఁబెనుగాలికిం గూలిన పేరడవివలెనుండెను. పాండవబలములో రెండువేల

రథంబులు, నేనూఱేనుంగులు, నైదువేలగుఱ్ఱంబులు, పదివేల కాల్బలములు మిగిలెను''

(3) ద్వైపాయనహ్రదములోడాఁగిన దుర్యోధనుని ధర్మరాజు యుద్ధమునకుఁ బిలుచుట.

రాజేంద్రా! వినుము ఏకాదశాక్షౌహిణీ పతియగు దుర్యోధనుఁడట్లొంటరియై పోలికలను వాసిచనిన, నేనును గృష్ణ ద్వైపాయన మునీంద్రుని కృపవలన, సాత్యకిచేఁబడి మృతి నొందుటకుఁదప్పి, సంగరరంగము వాసిచని, దానికనతి దూరం బుననున్న ద్వైపాయనంబను మడువునకు సమీపముగా రారా జుంగంటిని. అతండు దీనాననుఁడై తనకింకఁ బాండవుల నాశ్రయించి బ్రదుకఁబోలదని నాతోనుడివి, యమ్మడువుసొచ్చి, తన మాయావిద్యమహిమచే నీటిలో డాఁగియుండెను.

అప్పుడందులకుఁ గృపకృతవర్మాశ్వత్థామలు రారా జెందున్నాఁడోయని యతని నన్వేషించుచు, నక్కొలని దరి నన్నుఁగని, నీళ్లయందతనియునికి నాచే నెఱిఁగినవారై దుఃఖించి, రాజునుద్దేశించి,

క. "లెమ్మి కురునాథ! కడఁగుము
మమ్ముఁగొని పాండుపుత్రమథనమునకునై
న్యమ్మదియును నీచేతఁగృ
శిమ్మయ్యెడుఁజుమ్ము వలదుశంకింపంగన్."

అని రణంబునకుఁ బురికొల్పిన, నతండప్పుడు డస్సి యుండుటచే, లావువచ్చినతర్వాత వైరుల గెల్వవచ్చుననియె. అంతలో ధర్మనందనుఁడు కౌరవస్కంధావారంబున నున్న కురుపతిసతులనెల్ల యుయుత్సునితోఁ గరిపురికిఁబంపి, సోదర

పాంచాలకుమార కృష్ణసాత్యకిప్రభృతులతో జలాశయంబు సేర వచ్చుటంగని, యాముగ్గురు రథికులు నచ్చోటువాసి దూర మునసున్న యొక్కవట వృక్షంబుపొంతనుండిరి. నేను నొక్క పొదలో డాఁగియుంటిని.

పాండవులు దుర్యోధనుం బొడఁగాన నేరక విషణ్ణులై యుండ, నతండు కృపాచార్య ప్రముఖులతో సంభాషించుచుం డినవిధంబును వినిన కొందఱు భీమసేనుని వేఁటకాండ్రు, ధర్మ రాజునకుఁ గౌరవపతి నీళ్లలోఁ దూఱియున్నవాఁడని తెలియఁ జెప్పిరి. పాండవాగ్రజుండు జలాంతర్గతుండగు కౌరవాగ్రజు నుద్దేశించి యిట్లనియె "సుయోధనా! నీవంటి క్షత్రియులకు శత్రువులకు వెఱచి మడువులోఁ జొరఁబడుట తగునా? కొడు కులు, దమ్ములు, మిత్రులగు రాజులు, బంధువులు నీకైగణ ములో నీల్గిరి. నీవును వారివలెఁ బోరాడి వీరస్వర్గము గైకొ నుము; లేక గెల్చిపుడమి యేలుము. అట్లుగాక నీచవృత్తినోడ లోమినచో నిన్ను జనులుదిట్టరా? ప్రాణముకంటె మాన మెక్కుడగుట మఱచితివా?

చ. అని మమునోర్చినన్ బృథివి
      యంతయు నేలఁగవచ్చు, లేక చ
   చ్చిన సురసద్మ సౌఖ్యములు
      చేకుఱు, రెండు దెఱంగులందు నొ
   ప్పనియది లేదు, డాఁగనగుఁ
      బాటును ప్రాణముచేటుఁ దెచ్చుకోల్
   వినుమము నీవెదుర్పఁ దగు
      వేయు విధంబులఁ జాటిచెప్పెదన్."

దుర్యోధనుఁడు నీటిలోనుండియే ధర్మరాజుతో మను జుఁడు ప్రాణభయంబునొందుట సహజమనియు, బంధుమిత్ర పరిజనంబులా గోలుపోయి శ్రమమడరియున్న యాతనికి నాహ వముపై నుత్సాహము లేదనియు, వలసినచో రాజ్యమెల్లను బాండవులే కైకొనవచ్చుననియుఁ జెప్పెను. కౌంతేయ పూర్వ జుఁడు రాజులకుఁ బరిగ్రహ మొప్పదుగావున, నాతనింజంపి పుడమిగొనుట కార్యమని తెల్పి యాతని నేర్పుమాట లుడిగి పోటునకు వచ్చునట్లు పలికెను. ధర్మరాజునకుఁ దరువాత భీమ సేనాదులును పాంచాలకుమారులును నట్లే రారాజుం బిల్చిరి. అంత దుర్యోధనుఁడు కోపోద్దీపితుఁడై పుట్టనుండి వెలువడు పామువలె జలాశయంబు వెడలి, గదాపాణియై యందున్నవారి నెల్లఁ దనతో నెక్కటికయ్య మొనర్పుటకై పిలిచిన, ధర్మనం దనుఁడు సంతోషించి యతనికి వలయు వర్మాది సాధనములిచ్చి,

తే. "ఏటికొనుమీవు నొకనిమాయేవురందు,
వాఁడునీతోడఁదగఁ బోరువాఁడు, వానిఁ
జంపినుహియేలు, వానిచేఁజచ్చిత్రిదివ
సౌఖ్యమొందుము, చేసితిసమయమేను"

అని పలికెను.

రాజేంద్రా! కృష్ణుఁడప్పుడు పాండవాగ్రజునితో రహ స్యముగా "ఇదియేమి? ధర్మనందనా!

చ. ఒకరునిఁ జంపితేని సకలోర్వియుఁ గైకొనుమంట నీవుమున్
శకునికి మాయజూదమున సంపదలెల్లఁ ద్రయోదశాబ్ద భో
గ్యకృతి నమర్చియొడ్డినటులైనది, పందెపుఁగయ్య మమ్యోశ
త్రుకులము నెల్ల దుఃఖపడిత్రుంచుటదాఁదుదిఁబందెమాడనే.

గదాయుద్ధ కుశలుండగు రారాజును గెల్చుటకు బాహు బలాఢ్యుఁడైన భీమునకును భరంబై యుండుననుట విచారింపక, యేవ్వరలో నొకని యుద్ధార్థమై కోరుకొనునట్లు తనికిఁజెప్పుట తప్పుకదా? ఇది సాహసంబునకుఁ దఱియగునా ?" యని వాయుపుత్రుంజూచి, గదారణంబున కతనిఁ బురికొల్పి, దండి మగండగు కౌరవపతితో జాగ్రత్తగల్గి పెనంగి జయంబుగొను నట్లు నియోగించి దీవనలిచ్చెను.

—:(4) భీమునిగదచే దుర్యోధనుఁడు తొడలువిఱిగి నేలఁబడుట.:—

భీముఁడుద్దండగదా దండంబుగొని వృత్రాసురున కభి ముఖుండైన వజ్రింబోలె రారాజున కెదురైన, నత్తఱిభారత రణ ప్రారంభమునకు ముందు తీర్థయాత్రవోయిన బలరా ముఁడు, భీష్ముఁడు శరతల్పగతుండగుటయు, ద్రోణకర్ణ శల్యులు కూలుటయు, దుర్యోధనుఁ డనిలజునితో గదా యుద్ధసన్న ద్ధుఁడగుటయు నారద మహర్షి చేవిని, తన శిష్యులగద పోరు చూడనెంచి, యతిత్వరితగమనంబున నచ్చోటునకువచ్చెను. ధర్మ నందన కృష్ణసాత్యకులును, దక్కిన పాంచాలురును రేవతీరమ ణునకు సత్కారములు నడపిరి. తనకు మ్రొక్కవచ్చిన భీమ దుర్యోధనుల నభినందించి బలభద్రుఁడందున్న వారితోఁ బుణ్య ప్రదేశంబైన శమంతపంచకమునందే రణముసేయుట లెస్స యనిన, నందఱు నతనిమేలిమాట కియ్యకొని, యెప్పటి పొలి కలను సేరవచ్చిరి.

హలాయుధ కృష్ణధర్మనందన ప్రముఖులు సూచుచుండ నక్కురు పాండవ వీరులగు దుర్యోధన భీమసేనులు వీరోక్తు లాడుచు, భూమిగ్రక్కదల నొండొరువులపై నడచిరి. కొండ

కొండఁ దాఁకినట్లయ్యిరువురు బహువిధ చిత్రగతులం దిరుగుచు ధైర్యంబును శౌర్యంబును, నేర్పును దర్పంబును, బలంబును, జలంబును మెఱయ, నొండొరులపై గదఁ వేయుచు నొప్పించుచు, నుప్పరంబుననున్న వేల్పుగమికైన గెల్పోటమినిరూపించి పలుకశక్యముగాని యట్టి సమవిక్రమంబునం బోరుసల్పిరి. పరస్పరపటుగదా హతిచే భీమ దుర్యోధనులు సోలినప్పుడెల్లఁ బాండవ పాంచాలాదులు ఖేదమోదంబులం బొందుచుండిరి.

రాజేంద్రా! వినుము కృష్ణుఁడప్పుడు పార్థుంజూచి భీముఁడు లావుగలవాఁడైనను, వెరవరియగు దుర్యోధనుఁడు పేర్చి యాతని నొప్పించుచున్నాఁడనియు, న్యాయమగు యుద్ధమున దుర్యోధనుని గెల్చుటకు వీలుకాదనియు, మాయావియగు నప్పాపచర్యుని భీముఁడు తన ప్రతిజ్ఞ నెపమున నూరుభంగము సేయకున్న మోసంబు వాటిల్లుననియుఁ జెప్ప, నాధనంజయుఁడు భీముఁడు దన్నుఁజూచు నవసరమున, నిజోరుప్రదేశంబు కరతలంబున నప్పళించెను. భీముఁడది పగతుని తొడలపై గదవైచుటకు సంజ్ఞగా నెఱిఁగి, గదమీఁదికై త్రిప్పుచుఁ దనపై కుఱికివచ్చుచున్న రారాజు తొడలుదాఁక రయంబున గదవైచిన నతండు భగ్నోరుఁడై ధరణింబడియె. పాండవపాంచాలాదు లదిచూచి సంతసమందిరి. భీముఁడు సత్వరంబుగా నీకొడుకుఁ జేరంజని, "దురాత్మా! పాంచాలిం బరిభవించిన దాని ఫలంబనుభవింపు" మని చెప్పుచు, నాతని శిరంబుదన్ని, చుట్టునున్న వారింజూచి,

ఆ. "శంక లేక కడఁగి సభకట్లు పాంచాలి
నంటరానిదాని నొంటిచీర

తోనయున్న సాధ్వీవేనలివట్టియీా
డ్పించినతనిఁజూడుఁ" డంచుఁ బొదలి.

మఱియు నాతనిమెడ వట్టియదిమి తలదన్నెను. ధర్మ రాజతనివారించి బాంధవ నాశనకరుండగు కురుపతిం జూచితద్ద యుదుఃఖించుచుండెను.

రాజా! నాభికి దిగువగా నడిచి గదా రణంబుపాడి దొఱఁగి జయంబుగొన్న భీమసేనునింజూచి, బలరాముఁడత్యం తక్రుద్ధుఁడై యతనిపై సత్వరంబుగాసడరిన, వాసుదేవుఁడడ్డము సొచ్చి వడముడి ప్రతినయు, జడదారియగు మైత్రేయుని శాప ప్రకారమును జెప్పి, సత్యపరాక్రమవంతులును, సత్పురుషు లును, మిత్రులును, మేనత్త కొడుకులునునగు పాండవులకు శుభంబుగోరుట లెస్సయగుఁగదాయని. యన్నకోప ముపశ మింపునట్లు పలికెను. శౌరిపల్కులు వినిసీరి,

తే. "ఓపిధర్మార్థకామంబు లొకటినొకటి
నాశమొందింపకుండంగ నడపనలయుఁ
గాకధర్మంబు సెడనర్థకామములను
గోరుపురుషుండు నిందకుఁగుదురుగాఁడె.

నెఱిమాలిన కయ్యమునగెల్చిన భీముఁడు పొగడును, ధర్మయుద్ధనిరతుఁడై పడిన కురుపతి యుత్తమలోక సుఖంబును బడయుదురుగాక" యనుచు,బలుమొగంబుతో నచ్చోటు వదలి పోయెను. పాండవాగ్రజుఁడు చింతిల్లెను. తక్కికివారెల్ల సంతో షించియార్చి, భీమసేనుని విజయంబు గొనియాడిరి. కృష్ణుఁడు

భీమునిగదాస్త్రమరధర్మవిరోధము నుల్లాంఛితివారు దలంతురోయని శంకించిన వాఁడై యందఱు వినని ట్లనియె.

ఉ. "చక్కటిలేని యాలమునఁ జంపెననన్ వలదీదురాత్మకుం
డక్కటికంబు లేకసతి నంతలు సేసినను౦ గృపారతిం
దక్కక తండ్రిపాలడిగె ధర్మజుఁ డన్నౌటి సేయఁ డయ్యెవీఁ
డుక్కువుఁడిట్టిచావునకు యుక్తుఁడగుంగలపోసి చూడఁగన్.

ఆ. నేలఁగూలి ప్రమాను శ్రాలెనిట్లున్నయి
ప్పాపకర్ముఁగుఱిచి పాడి తెలఁగు
తేటపడఁగ మాటలాడ దానేల మీ
రెక్కుఁడరదముల మహీశులార."

మహీపతీ! అప్పల్కులకు నీకొడుకురోషించి, పుచ్ఛంబు దెగిననాగంబువలెఁ దలయెత్తి కృష్ణుం జూచుచుఁ గనుంగొని, మాయోపాయంబుల భీష్మద్రోణ సైంధవకర్ణాదివీరులనెల్ల మడియించినకపట శూరుండని యాతని నిందించెను. మురవైరియు రారాజుతోనాతండు దొడఁగిన దుర్ద్యూతమే కౌరవ్యులచేటునకు మూలకారణముగా నిరూపించి, యచ్చోటువదలి సాత్యకి పాండవేయులతోఁ గౌరవశిబిరంబుసొచ్చి, యందున్న ధనకనక వస్తువాహన నివహంబులెల్లఁ ధర్మరాజు వశంబుసేసి, పాడైన యాపీటిలోనుండనొల్లక, రాత్రివాసంబునకుఁ జేరువనున్న యోఘవతీ తీరము లెస్సయగునని విచారించి యందఱితోనందులకుఁ బోయెను. ధృష్టద్యుమ్నుఁడును, శిఖండియు, నితర పాంచాలురును, ప్రతివింధ్యాదులగు ద్రౌపదేయులును, దక్కిన రాజులును రాత్రివిశ్రమించుటకుఁ దమవిడిదలయే మేలగునని భావించి, హతశేషంబులైన బలంబులతోఁ బాండవశిబిరంబు సేరిరి."

## (5) కృష్ణుఁడు కరిపురికిఁ బోయివచ్చుట.

వైశంపాయనముని జనమేజయునకుఁ బాండవుల విజయ ప్రకారమంతయు సంజయుఁడు ధృతరాష్ట్రునకుఁ జెప్పుట యెఱింగించి మఱియు నిట్లనియె. "భూపతీ! వినుము పాండవులట్లు కృష్ణసాత్యకులతో నోఘవతీతీరముననుండ, నప్పుడు పుత్రమరణశోకాతురయై తన్ను గాంధారి శపించునో యని వెఱచి ధర్మరాజు కృష్ణస్వామిని హస్తిపురికిఁ బోవునట్లు ప్రార్థించిన, నాజగన్నాటక సూత్రధారి యతిత్వరితగమనంబున నారాత్రియే కరిపురికి వెడలి, గాంధారిధృతరాష్ట్రులం గని, వారలకు దుర్యోధను మరణవార్తను దెలుపకయే, కురుకులక్షయమునకు వగవకుండునట్లును, విధికృతంబు గడవ నేరికి శక్యముగాదనియు, వృద్ధులగు వారికివలయు పరలోకక్రియలు పాండుపుత్రుల యందే నిలుచుటచేఁ బుణ్యవర్తనులును బంధుప్రియులునునైన వారికి శుభంబుగోరుట లెస్సగుననియును, బహువిధంగులైన వాక్యముల నావృద్ధదంపతుల శోకంబపనయింపఁజేసెను. వ్యాసమహర్షియు నాసమయంబున నక్కడ వాసుదేవుని మాటలు పాటిగా నుండునట్లు కడకను గోడలిని బోధించుచుండెను. కృష్ణుఁడు మరలి యారాత్రియే ధర్మపుత్రుం గని యతనికిఁ దనపోయివచ్చిన కార్యప్రకారంబంతయు నెఱింగింప, నతండు సంతోషించి, కృష్ణసాత్యకి సోదరులతో నారాత్రియందే సుఖనిద్రసేసెను.

## (6) అశ్వత్థామయుత్సాహము.

మనుజేంద్రా! వినుము సంజయునిచేఁ బాండుపుత్రులోఘవతీ తీరమునకుఁ జనుటను విని ధృతరాష్ట్రుఁడు కడుదుః

క్షితుఁడై "సంజయా! తొడలువిఱిగి నేలఁబడియున్న నాకొడు కేమయ్యె?"నని యడిగిన, నాసూత తనయుం డాతనికిట్లనియె.

"మానవేశ్వరా! కౌంతేయాదు లెల్లఁబోయిన తర్వాత నేనును రారాజుకడకు సరిలుచుఁబోయితిని. అతఁడు నన్నుఁగని "కాలసంప్రాప్తమేరికిఁ గడపవచ్చు"నని దుఃఖించిపలికి, ధర్మనందన ప్రముఖులనిందించి, భీముఁ డధర్మయుద్ధమున నతనిఁబడఁద్రోసి తలఁదన్నిన విధంబంతయును గృపకృత వర్మాశ్వత్థాములకుఁ జెప్పునట్లు నియోగించి యిట్లనియె.

క. "పగవారి నాశ్రయింపక
మగఁటిమియును బ్రాభవంబు మానము నెంతుం
బొగడొందఁ నుల్లసిల్లితిఁ
దెగునంతకు లక్ష్మితోఁ బ్రదీప్తుఁడనైతిన్."

క. "సమరము శమంతపంచక
సమీపమున ధర్మవృత్తిఁ జలుపఁగ నత్యు
త్తమలోకము సమకూరెను
విమలాత్ముఁడనైతి నొంపు వేయును నేలా."

అంతలో నాముప్పురు రథికులును రారాజు జూడవచ్చి కడుదుఃఖితులైరి. అశ్వత్థామ భీమసేనుని దౌర్జన్యమును విని, దుస్సహకోపుఁడై పాండవ పాంచాలుర నెల్ల సపుత్రమిత్ర సైన్యంబుగా మృతినొందించుటకు నక్కురుపతి యనుమతివేఁడిన, నాతఁడప్పుడే కృపాచార్యునిచే ద్రోణపుత్రున కభిషేక

మొనర్చి, సంతసంబున నాతని వీడుకొల్పెను. రాజేంద్రా! అశ్వ త్థామ యత్యుత్సాహసమన్వితుండై కృపకృతవర్మల వెంటం బెట్టుకొని, సింహనాదంబులు సెలంగం, బాండవస్కంధావార మున కభిముఖుండై చనుచుండెను.''

ఇది శల్యపర్వ కథాసంగ్రహము.





శుభమస్తు.

# బాలభారతము.

## X. సౌప్తికపర్వము.



### —:(1) అశ్వత్థామ పాండవశిబిరంబులో నిద్రించువారి నెల్లఁ జంపుట. :—

వైశంపాయనుఁడు జనమేజయున కిట్లనియె.

"గురుపుత్రుని యుత్సాహంబు సంజయుఁడు ధృతరాష్ట్ర భూవిభున కెఱింగించి మఱియు నిట్లనియె. "దేవా! పాండవ శిబిరంబులోనివారు జయోత్సాహ సమన్వితులై పొంగుచుఁ జెలంగుచుఁ బేరెలుంగున నార్చుచుండినందున, నశ్వత్థామ కృప కృతవర్మ ల[illegible]సవ్రాచక, చేరువనున్న నొక యడవిసొచ్చి. యప్పుడు సంధ్యాసమయమగుటచేఁ గాలోచితకర్మంబు లాచరించి, యథాశ్రమంబడరి యొక పెనుమఱ్ఱిక్రింద విశ్రమించిరి. కృపకృతవర్మలు నిద్రించిరి. క్రోధావేశంబుగొన్న ద్రోణి నిద్రింపక యొక వటవృక్షంబు నాలోకించుచుండ, నొకయులూకంబా చెట్టుకొమ్మలలోఁదు నిద్రావశంబుననున్న వాయసంబులం బొడిచి, ఘోరప్రకారముగాఁ గంఠంబుల నులిమియు, గోళ్లఁ జీరియు, ఱెక్కలు నఱికియుఁ బొట్టలుచ్చియు నానావిధ గతుల వధియించుటంగని, తన మనంబులో నిట్లని విచారించెను

"రారాజునకు బాసయిచ్చిన చొప్పున బలియురగు పాండవులం జం॥ నుపాయమన్వేషించుచున్న నాకీయులూకంబు మార్గంబు సూపెను. పగతురంగూల్చుచో న్యాయాన్యాయములు బరికింపనేల?

తే. "ఎత్తినప్పుడు, విడియుచో, నిజకటంపుఁ
బెరువునందు నడపు సెడి తిరుగఁబడిన
యట్టియెడ, నిద్రవోయెడు సమసరమున,
శాత్రవులబెట్టుపెఁ బడిచంపవలయు."

అని నీతివాక్యములు గలవు. వేయేల? పాండవులు న్యాయరహితమగు యుద్ధమునఁగదా భీష్మ ద్రోణ కర్ణ దుర్యోధనాదులంగూల్చిరి. నేనును నిద్రాసమయమున వారిని నిగ్రహించుట ధర్మమగును."

కృపకృతవర్మలు నంతలో మేల్కొనిరి. గురుపుత్రుఁడు మామనుఁజూచి కార్యాలోచనము సెప్పునట్లు వేఁడ, నతండు తన మనస్సుఁ డాగ్రహవృత్తిమై నింద్యమగు విక్రమంబున నిద్రించుచున్న వారిని జంప నుత్సహించునోయని విచారించి, హితముపదేశించువాఁడై యతనితో

ఉ. "క్రోధము లోభముల్ భయముఁ గూరిన చిత్తముతోడ దుష్టసా
ధనవృత్తి మూర్జనుఁడు సజ్జనులాఁగఁగఁ జేయు కార్యముల్ [యా
బాధలఁ బెట్టకున్నె, సిరిపాయఁగఁ జేయక యున్నె వానిఁ దీ
వ్రాధినితాంతదుఃఖహృదయత్వము దేరక యున్న వానికిన్."

కురుపతి దుర్వినయంబునం జెడియె. మనకిడిచిపడ నేల? రాత్రి సుఖనిద్రసేసి కర్తవ్య మెద్దియో దాని రేపకడమనంబు దెలివొందియుండగా నిర్ణయించుట లెస్స" యనియెను.

అశ్వత్థామ మేనమామతోఁ దనతండ్రిం జంపినవాఁడు సుఖియై ప్రాణములతో నుండఁ దనకంటికి నిద్రరానేరదనియు. దుర్యోధనునకుం బ్రియంబుగాఁ బగఱంగూల్చుట కర్తవ్యమనియుఁ బలికి, సత్వరంబుగా రథమెక్కి చనిన నాగౌతమకృతవర్మలును వాని వెంబడించిరి. మూఁడగ్నులవలె వెలుఁగు మువ్వురు పాండవ శిబిరంబు సేరంజన, నశ్వత్థామ కొక్క మహాభయంకరాకారముగల భూతము దృష్టిగోచరమయ్యెను. వాఁడించుక యేనియు వెఱపుగొనక, యప్పను భూతముపైన నేక శస్త్రాస్త్ర జాలములు నిగిడించిన, నది వానినెల్ల మ్రింగి యతని కడ్డమై నిల్చెను. అశ్వత్థామ యప్పుడు వగపును సిగ్గును బొంది, మామపల్కులు వినక కీడగు తెఱపునఁ బరులఁ బోరిగొన నెంచిన తన్నుఁదాననిందించుకొని, తేరుదిగ్గి నేలపైఁ గూర్చుండి, యాపద్ధ్వాంతభానుండైన యీశానుని భక్తితోఁ దలఁచెను. శివుఁడు ప్రత్యక్షమై యొకవక్ర ఖడ్గమశ్వత్థామచేతికిచ్చి దానిచేఁ బాంచాలురనెల్లఁ జంప నియమించి, యతనికెఱుఁగ రాకుండ నతని దేహములోఁ దన తేజము నావేశింపఁజేసెను.

రాజేంద్రా! ఆచార్యనందనుండధిక ప్రభచే వెలిఁగి యావంతయేనియు జంకక, పాండవ శిబిరంబు వాకిటఁ గృపకృతవర్మలనునిచి, తానులోఁ జొచ్చి మొదట ధృష్టద్యుమ్నుఁడున్న మందిరంబునకుఁబోయి, నిద్రావశంబుననున్న వాని నడిచియుఁ బొడిచియుఁ ద్రోచియుఁ ద్రొక్కియుఁ బశువుం గూల్చుమాడ్కి నికృష్టమగు విధమునఁ బొలియించి, ప్రహృష్ట హృదయుఁడై యాచప్పరంబు వెడల, నందలి స్త్రీజనంబులును రక్షు

కజనములును నాక్రందన ధ్వనులు నిగిడించిరి. కెలంకులనున్న రాజులును మేల్కాని.

క. రక్కసుఁడో మానిసియో
నిక్కమెఱుంగము వధించె నృపసూనుని వీఁ
డొక్కరుఁడుద్రగుఁడై రథ
మెక్కఁగనరిగెడున్ దురాత్మునెయిదుఁడు కడఁగన్"

అనియాండెఱు సపరివారులుగా నశ్వత్థామను పైనడరి యతని బాణములచే నిహతులై పడిరి. యుధామన్యు ప్రభృతి పాంచాల పుత్రులును, శిఖండియుఁ, బ్రతివింధ్యాదులగు ద్రౌపదేయులును, సింగంబు నెదిరించి కూలిన లేళ్ల వలె నశ్వత్థామ నిశాత ఖడ్గహతిచే నవనింద్రెళ్లిరి. సైన్యములెల్ల నశించెను. విడిదల వాఁకిటం దప్పి పాఱిపోవ నెంచిన వారినెల్ల నందున్న కృపకృతవర్మలు నిర్మూలము సేసిరి. కృష్ణ సాత్యకులును బాండవులు నందు లేమిచే మృత్యువునకుఁ దప్పిరి. తక్కిన వారెల్ల మడిసిరి.

రాజా! అశ్వత్థామ యంతఁబోయి శిరములం గొనుకొని కుత్తుసురుతోఁ బడియున్న రారాజుపాలికివచ్చి, తాను శత్రుశిబిరంబు నిర్మానుష్యంబుగావించుటయు, నందు వాసుదేవసాత్యక పాండవేయులు లేమిచే వారు తనచేఁబడమియు నాతనికెఱింగించిన, నాభూతల పతిప్రీతచిత్తుఁడై యమ్మువ్వురం జూచితన్ననెఱుంగునవారి విక్రమంబు గొనియాడి, "యందఱను స్వర్గములోఁ జూచెదఁగాక" యని ప్రాణములు విడిచెను. అంత వారుదుఃఖితులై రారాజుం గౌఁగిలించుకొని యతనికిం బ్రదక్షి

ణంబు సేసి తమ తేరులెక్కి కరిపురంబు దిక్కు చనిరి. అప్పుడు తెల తెలవేగిన నేనును నీకంతయుఁ జెప్పనిటకు వచ్చితిని. నీకొడుకు మరణంబు గనుంగొనుటతో నాకువ్యాస మహర్షి ప్రసాదించిన దివ్య దృష్టియుఁ దీఱిపోయెను."

**(2) అశ్వత్థామ పాండవులచే భంగపడి వారికిఁ దన శిరోరత్న మిచ్చుట.**

వైశంపాయనము నీంద్రుఁడు మఱియు జనమేజయున కిట్లనియె. రాజాగ్రణీ! వినుము. ఓఘవతియొద్దను వృకోదరాది సోదరదామోదర సాత్యకులతోనున్న ధర్మసూనుఁడు, తన వీడులోని వారెల్ల నశ్వత్థామ గురుతనయునిచేఁ జెగినవార్తను విని, శోకవేగంబున సొలిసేల వ్రాలెను. కొంత వడికి నతఁడు తెప్పఱిల్లి, చనినవారిం దలంచి వనవుచు, నుపప్లావ్యమున నున్న ద్రౌపదిని, విరాట పాంచాల మహిషులను, దత్సంబంధులైన స్త్రీజనంబులను నతిత్వరితంబుగాఁ దమవిడిదలకుఁ దెచ్చునట్లునకులున కాజ్ఞయిచ్చి, తానును వాసుదేవాదులతో నందునకుఁ బోయి, వికలాంగులై నెత్తుటఁదోఁగుచు నేలంబడి యున్న కొడుకులను, మఱదులను గనిమూర్ఛిల్లి పుడమిం బడెను. ఆతని తమ్ములును గేశవుఁడును బ్రజ్ఞయెడలి పడిరి, అందఱను సాత్యకి తగినపల్కులఁ దెల్పెను.

ధర్మరాజు తెగిన వారికెల్ల నగ్నియిచ్చి యొక్కచోనుండ, నకులునితోవచ్చిన ద్రోవదియు, నితర వనితాజనములును నేలంబడి పొరలుచు నేడ్పు టెలుంగులు నింగిముట్ట మహానాదంబుగా రోదనంబు సేసిరి. అశ్వత్థాను క్రౌర్యంబు దలఁచి పాం

చాలిలేచి, యుదంచిత క్రోధమూర్తియై ధర్మపుత్రునితో గురుతనయునిం జంప భీముని నియోగించుమనట్లు చెప్పి,

క॥ "వాయుసుతుఁ బనిచి నేఁడటు
 సేయింపక తక్కితేనిఁ జెప్పెద వినుమేఁ
 బ్రాయోపవేశమునను
 కాయము పేక్షింతుఁ జుమ్ము కౌరవనాథా"॥

యని యనశనంబు సంకల్పించుకొనిన, నప్పుడతిని ధర్మరాజూరార్చి, యడవింగోఁ దపోనిరతినుండ నోపు చాపాచార్యతనయు వధించుటకు సమకూరదనియె. పాంచాలి యంత నవ్వాపచర్యునకుఁగల శిరోరత్నము దెచ్చియిచ్చిన జీవంబుతో నుండఁగల దానననిచెప్పి యప్పనికై భీమసేనుని యోగించెను. అతం డప్పుడే నకులునిం దనకు సారథిగా నొనర్చి తేరెక్కి శిబిరంబు వెడలి. మార్గస్థులైన జనులచే నశ్వత్థామ కరిపురంబునకుఁ బోయి మగిడి గంగాతీరమున వ్యాసాశ్రమమున నున్నవాఁడని యెఱిఁగి, యద్దిక్కై తేరు వ్రానిచ్చుచుండెను.

కృష్ణుఁ డిక్కడ ధర్మనందనునితో నశ్వత్థామకు ననివార్యమైన బ్రహ్మశిరో నామకమను దివ్యాస్త్రముగల దనియు, నతనిపై భీముఁ డొంటరిగాఁ జనుట కీడనియుఁజెప్పి, సాత్యకి సహదేవుల శిబిరంబున నుండ నియమించి, పార్థ ధర్మజులను గరుడధ్వజాంబు గ్రాలు నిజరథంబుపైఁ బెట్టుకొని, తాను సారథియై సత్వరంబుగా రథంబు దోలుకొనిపోయి, జాహ్నవీ తీరమున భీనుుంగదిసి యొంటిమైఁ జనకుండు నట్లతని వారించెను. పావని కృష్ణద్వైపాయ నాశ్రమంబు సొచ్చి, తపస్సునకుఁ దొడగిన యశ్వత్థామను గని క్రోధపరవశుఁడై

గీ. "ఓరిధాత్రీసురాధమ ! క్రూరకర్మ !
కపటధార్మిక ! యత్యంత కల్మషాత్మ !
యుక్తిఁబోయిన రేయిమహోగ్రవృత్తిఁ
దగిలితెంతవే గిరమునఁ దపసినైతి?

ఇట్లు తొలఁగినను జావునప్పుడు. రణంబునకు లెమ్ము. తపంబు సాలింపు" మనిపలికెను

అశ్వత్థామ భీముని నాతనికి వెంటవచ్చు ధర్మజపార్థులను గని వారిం గెల్వ నలవికాదని వగచి, "అపాండవ మగుఁగాక" యని బ్రహ్మశిరో నామకాస్త్రము నేసిన, సుత్రామపుత్రుడు కృష్ణోపదేశంబున సత్వరముగా నాయస్త్రమునే యేసి ద్రౌణి యస్త్రంబు వారించెను. అప్పుడు వ్యాసనారద మహామునులేతెంచి జగద్బాధకరములై దీపించుచున్న నాయస్త్రముల నుపసంహరింప వేఁడిన, వ్రతశక్తియు గురుభక్తియుఁగల ధనంజయుఁడు తనయస్త్రమును మరలించెను. అశ్వత్థామ కట్లుచేయ నలవికాక సిగ్గొంది మునులం గనుంగొని, తనయస్త్రము పాండవభార్యల సంతానంబులం గాల్చునే యనియె. వ్యాసుఁడు దానిక సమ్మతించి, దివ్యాస్త్రవేదియగు పార్థుని గెల్వనలవికాదు కావునఁ, బాండవులకుఁ దన కిరీటంబిచ్చి వారికి సమాధాన మొనర్చునట్లు గురుతనయున కుపదేశించెను. అతఁడు దాని కొడంబడి, తాను బాండవ సంతాన విషయముగాఁ మొదట బలుకుటయు, దానికిముని సమ్మతించుటయును దలపోసి, యయ్యది చాలదని వగచి, పాండవవంశము విచ్ఛిన్నమగునట్లు, తనయస్త్రము సకలగర్భ విచ్ఛేదంబు గావించెడు మనియె. కృష్ణుఁ డట్లుగాకుండు నట్లనుగ్రహించి, యభిమన్యుని భార్య యుత్తర

గర్భములోనున్న యర్భకుని రక్షించువాఁడై పలికి, క్రూరాత్ముఁడై బాలవధకు మొనసిన యశ్వత్థామను దురంతరోగ పీడితుండగు నట్లు శాపమిచ్చెను. కృష్ణుఁ డిచ్చిన శాపమును వ్యాసమహర్షియు స్థాపించెను. అశ్వత్థామ వ్యాసుంజూచి "నీవు మనుష్యులలోనేయుండు" మని ప్రతిశాపమిచ్చి, తన శిరోరత్నమును బాండవులకిచ్చి తపోవనంబున కరిగెను.

అంత ధర్మనందనప్రముఖులు వ్యాసనారద మహర్షులచే ననుజ్ఞాతులై మరలి శిబిరంబునకువచ్చి, ద్రౌపదికిం బ్రియంబుగా శిరోరత్న మొసగిరి. ఆనారి రత్నమా శిరోరత్నమును ధర్మరాజునకీయ, నతండు దానిశిరంబున ధరించి చంద్రబింబముతోఁడి తూర్పు కొండవలెఁ బొల్చెను.

రాజేంద్రా! వినుము. బ్రహ్మశిరంబు ప్రభావంబునఁ బాండవేయ వంశవధూజనంబులకెల్ల గర్భములు లేకుండెను. శ్రీకృష్ణుఁ డనుగ్రహించుటచే నుత్తరాదేవి గర్భము మాత్రము సురక్షిత మయ్యెను. ధర్మరాజంత భక్తార్తి హరుండైన హరిం గనుంగొని, యశ్వత్థామ బలియుండగు ప్రతివింధ్యాదులను, ధృష్టద్యుమ్న ప్రభృతి పాంచాలురను, నెట్లేయి నేకతంబుగాఁ జంపఁ గల్గెనోయని యడుగ; నుత్తర గర్భావన లోలుండగు నవ్వాసుదేవుఁ డన్నరదేవునకుఁ గుంభసంభవ సంభవుండు శంభుని వరప్రసాదమున గండుమిగిలి, పాండవ శిబిరంబులోని దండిమగలఁ జెండాడఁ గల్గెనని చెప్పి, యాతనికి దేవదేవుండైన శివుని మహిమ యెల్ల నెఱింగించి, గతమునకు వగవక, యసమ సమర లబ్ధ విజయానందం బనుభవించునట్లు బోధించెను."

ఇది సౌప్తికపర్వ కథా సంగ్రహము.

---

శ్రీ

శుభమస్తు

# బాలభారతము.

## XI. స్త్రీపర్వము.



### (1) సంజయ విదుర వ్యాసులు ధృతరాష్ట్రునకు దుఃఖోపశమనంబు సేయుట.

వైశంపాయనుఁడు జనమేజయున కిట్లనియె. "వినుమో రాజేంద్రా! తననూర్వురు కొడుకులు మడియుటకు ధృతరాష్ట్రుఁడు మహాదుఃఖమనుభవించుచుండ, సంజయుండతనితో నిట్లనియె, "రాజా! ఏల యిట్లవివేకివలె దురపిల్లెదవు? పితృభ్రాతృ పుత్ర పౌత్రమిత్ర సుహృత్సహాయులు పల్వురు సచ్చిరి. వారిలో నెవ్వరికని యేడ్చెదవు? వారిలోఁగా నివారలెవ్వరు? అదియునుంగాక పాండవ కౌరవులకు వైరము నీవెఱుఁగకయే జనించెనా? నీ పెద్ద కొడుకు హితులగు పెద్దల పల్కులు నిరాకరించి దుష్టబుద్ధులగు దుశ్శాసన కర్ణ శకునుల నాప్తులుగని చుట్టములతోఁ దెగెను, నీవును నీ లోభగుణము విడువక, కొడుకు విక్రమంబునచ్చి చేటు దెచ్చుకొంటివి. ఇప్పుడు వగచుట గతజల సేతుబంధనము కదా?

క. వగచినఁ బోయిన కార్యము
  మగుడునె వగవంగ లోకమాన్యుండగునే

నగపుణ్యగతికి మూలము
వగపెల్ల విధముల నుడుగవలయు నరేంద్రా.

లెమ్ము తెగినవారికిఁ బరలోక క్రియలు సేయవలయును. పొలికలనికిఁ బోవలయు"

అంత విదురుఁడు నేలంబడి పొరలుచున్న యారాజుంగనియిట్లనియె. "అన్నా! నీవు ప్రాజ్ఞుండవు. పెద్దలవలనధర్మములు విన్నవాఁడవు. మృత్యువుదుర్వారమై యెట్టివారినైన నపహరించు ననియెఱుంగవా? "అనిత్యాని శరీరాణి"యను నార్యోక్తివినవా?

తే. యౌవనంబును, రూపంబు, జీవితంబు,
ద్రవ్య సంచయములు, ననిత్యములు కావె?
వీనిహానికి వగపవివేకమగుటఁ
బండితులువగఁ గూరరు పౌరవేంద్ర.

అదియునుంగాక నీ కొడుకులు రాజధర్మనిరతులై సమరరంగములోఁ బడివీరస్వర్గము బొందిరి. వారికై వగపేల? పండితులు ప్రియవస్తువుల పోకకును, నప్రియంబైనవాని రాకకును దుఃఖింపరు. వారీలోకము నిస్సారంబుగా నెఱిఁగి, బహుళదుఃఖమయమైన సంసారమును గడతురు. ప్రాజ్ఞులచే సంసారము గహనతుల్యమని విన్నవాఁడను. నీకవ్విధంబెఱింగించెద నాకర్ణింపుము.

క్రూరమృగవ్యాళతస్కరసంతతి నిరంతరంబైన యొక్క కాంతారంబున, నొక్క బ్రాహ్మణుఁడు భయభ్రాంతుఁడై చనువాఁడెందును భయరహితంబైన శరణ్యస్థాన మొక్కటిగానక, దిక్కులు గనుంగొనుచుఁ, గడలేనియయ్యడవిం జనుచుం

డె, నెఱపుగొలుపు తెఱవ యోర్తువానిం గౌఁగిలించుకొనియె. అయిదుతలల యేనుంగుఁ బెక్కులు వానిం జుట్టిముట్టెను. కొండలమందు దండముతోడ వాఁడిందును నందును దిరుగుచుఁ నెఱుంగమిచే నొక్క తృణలతా వృతంబైన కూపంబు నం బడి, తత్తీరముననున్న యొక చెట్టునకుఁ బ్రాకిన తీగయూఁతగాఁ బట్టుకొని, తలక్రిందై యందు వ్రేలాడు చుండెను. ఆనూతి లోనున్న పన్నగ మొక్కటి వానిం గఱవ యత్నించుచుండెను. నూతిదరినున్న చెట్టుం బడఁ ద్రోయుటకై యాఱువదలలును బండ్రెండుకాళ్లును గల పెద్దయేనుఁ గొక్కటిదాని సమీపించు చుండెను. అంతేకాక తెలుపును నలుపును నైన యెలుకలు రెండా చెట్టువేరులను గొఱుకుచుండెను. రాజేంద్రా! ఇట్లా మనుష్యుఁడు క్రూరమృగ తస్కరకిరాత ఘోర కామినీ సామజ మూషికాదుల వలని భయంబుచే నిమిషమాత్రమేనియు నిశ్చయింపఁదగని జీవనంబుగలవాఁడై యుండియుఁ, దనయున్నయునికిఁ దలంపక, యావృక్ష శాఖలనున్న మధుకోశంబులోనుండి దొరుఁగుచున్న మధుధారల కాస పడుచు, నాలుకను జాచి రుచి చూచిచూచి తృప్తిని బొందనివాఁడై, జీవితంబుపై నాసయుమానకుండెను.

ధృతరాష్ట్రభూపతీ! సంసారములోఁ దిరుగు మనుష్యుని జీవితమునట్టిదియ. అది యెట్లంటేని, నప్పేరడవియే సంసారము. అందలి క్రూరమృగకిరాతాదులు రోగంబులు. ఘోరాకారయగు తరుణిజర. పంచశిరంబులగు ద్విరదము లింద్రియములు. నూతిపాము జముఁడు. తీఁగయే జీవితాశ లేక బ్రదుకుపైఁగల కోర్కి. నూతిగట్టుననున్న యాచెట్టాయువు. అమ్మహీజంబుపై

నడుమ సామజంబు సంవత్సరము. దానితలలు, గాళ్లు బుతు
వులు మాసములు తరుమూలము నఱకుమూషికము లహో
రాత్రములు. తేనెటీఁగలు కోరికలు. తేనెబొట్టులు కామరస
ములు. మనుష్యులు మూఢ సంసారవర్తనులై రోగాదుల
పాల్పడి యాయువు నెఱిగిపోవ మృత్యుగోచరులగుదురని యెఱుం
గక, కామాదిసక్తులై యుందురు. బుద్ధిమంతులగువారు జలిత
పుటురి చందమగు కామంబు నిరసించి, సంసారగహన ప్రకార
మెఱిఁగినవారై యింద్రియ జయంబుగల్గి, సంసార పాశబంధ
విముక్తులై సుఖింతురు. పండితులచే విన్న నీ యితిహాసము నీకుఁ
జెప్పితిని. కావున రాజపుంగవా! నీవును వృథాశోకంబుడిగి,
భారతరణనిహతులైనవారికిఁ బరలోక క్రియలునడపి కృతకృ
త్యుండవగుము.''

రాజేంద్రా! ధృతరాష్ట్రుఁడు విదురుని జ్ఞానప్రదంబు
లైన వాక్యములు విని కలఁక తేఱినను, దుదిగాఁ బుత్రుల పర
లోకక్రియా విషయంబులగు చెవిసూఁడినట్టి వేఁడి పల్కులువిని
మఱియు శోకమూర్ఛితుఁడయ్యెను. విదుర సంజయులు శైత్యో
పచార క్రియల నారాజుం దేర్చిరి. వేదవ్యాస మహామునీంద్రుఁ
డప్పుడా రాజువలని కారుణ్యంబుచే నచ్చటికి వేంచేసి యాతని
కిట్లనియె.

క. ''భూతములనిత్యములు నీ
వీ తెరువెప్పుడునుగనియహీనధృతిమెయిన్
జేతోగతినలవఱుపుము
భూతానిత్యత్వమదియుపుచ్చునువగలన్.''

పుత్రా! విధినిర్మింతంబైన దానిమాన్ప నెవ్వరికిఁ దర ముకాదు. లోభగుణ దూషితుండైన దుర్యోధనుఁడు సోదర సహాయులతోఁ దెగియె. వారికర్మమే వారిని మృతినొందిం చెను. నీవడల నేమిటికి?

తోటకము. తమతమతప్పులఁదారెరియుంగా
విమలమతీయిటువీరికినై శో
కమునదహింపఁగఁగాదుమనంబున్
సముచితమిత్తటిశాంతనుసూమ్నా.

కావున నీవు జ్ఞానంబున శోకాగ్ని నార్చి, పాండుపుత్రుల నీపుత్రులవలెభావించి, వారు నీసంపుసేయఁ గీర్తితో మెలం గుము. దర్మనందనుఁడు నిన్నవమానించునని తలఁపకుము. అతఁడు నీపై భక్తియుఁ గరుణయు నెయ్యమునుగలవాఁడు. నిన్నెప్పుడు గౌరవింపఁజూచును. ఆతఁడు నీవిట్లు దుఃఖించుచుం టనుజూచి మదిలోఁ గుందకుండునా?"

అని యిట్లనేక ప్రకారముల వ్యాసుండు దెల్ప ధృతరా ష్ట్రుఁడు శోకముడిగి మునివర్యునితో నునోధైర్యమూఁది పాండు పుత్రులయెడ సద్భావముగలవాఁడై వర్తించునట్లు చెప్పెను. మహర్షియుఁ బ్రీతుఁడై యంతర్ధాన మొందెను.

(2) పాండవులు గాంధారీ ధృతరాష్ట్రులను బొలికలసికోఁ జూచుట.

విదుర సంజయులు రణభూమికిం బోవుటకై వలయు పనులు గావించి, గాంధారీ కుంతీదేవులను సపరివారముగా ధృతరాష్ట్రునొద్దకుఁ దెచ్చిన, నందఱు నారాజుతోఁ దగిన వాహ నము లెక్కి ప్రయాణమైరి. అప్పుడు వారితో

సీ. చేతులు నడుదల సేర్చుటుత్కటశోక
మాకారములు దాల్చినట్లు లుండ
విరిసిన వేనలుల్ వెన్నులఁ బ్రక్కల
నెఱసి చూపఱదృష్టి నీఱు సేయ
నందందదొరఁగెడు నశ్రుజలంబుల
పెంపున మోములు ముంపఁబడఁగ
నేమియుఁ దొడవులు లేమిఁ బాడఱియున్న
యంగంబులందు దైన్యంబు నెరయ
తే. బావలనన్నలఁ దమ్ముల సుతుల హితులఁ
బేరుకొని వాపొలెండంగఁ బ్రేముడించి
పనవు పలుకులు విను వారి వనటఁ దేల్పఁ
గురుకుమారి నారీజనకోటి వచ్చె.

యుయుత్సుండును దుర్యోధనుని ప్రియకాంతలతో రాజుంగూడెను. అందఱు నట్లు కురుక్షేత్రంబునకు వచ్చుచుండఁ గృపకృతవర్మాశ్వత్థాములు ధృతరాష్ట్ర భూవిభున కెదురై, యతనిని గాంధారిని నూరార్చి చనిరి. అందుఁ గృతవర్మ తన పురికిఁ బోయెను. కృపుండు కరిపురికిఁ బోయెను. అశ్వత్థామ కృష్ణద్వైపాయనాశ్రమమునకుఁ బోవుటయు నతనికిఁ బాండవులచే నైన భంగపాటును ముందే యెఱింగించితిని.

ధర్మరాజును బరిజనములచేఁ బోలికలనికి ధృతరాష్ట్రుఁడు వచ్చుటను విని సత్వరంబుగా సోదరకృష్ణ సాత్యకి పౌత్స్యపాంచాలస్త్రీజనంబులతో నారాజు పాలికిఁ బోయి యతని చరణంబులకు మ్రొక్కిన, నావృద్ధరాజ ప్రియంబగు మనంబుతో నాతనిఁ గౌఁగిలించెను. భీమ పార్థ నకుల సహదేవులు మ్రొక్కుచున్న

వారని పరిజనులాయాధ నృపాలునకుఁ దెల్ప, భీముఁడను మాటకు మహాక్రోధ పరవశుఁడై, యతనిం బిగియారఁ గౌఁగిలించి చంపవలయునని ధృతరాష్ట్రుఁడు దలంచెను. సర్వజ్ఞుఁడగు హరి దాని నెఱింగి రాజునకు ముందట భీముం బోనీయక, యొక యినుపరూపును వానిముందట నిల్పె. పదివేల యేనుఁగుల బలముగల వాఁడగు నాయంబికా పుత్రుఁడు గాత్రము వంచి తన ముందటనున్న యయోమయంబగు రూపము భీముండే యని తలఁచినవాఁడై, దానిం గౌఁగిలించి పొడిచేసి నెమ్మనంబు సంప్రియమంది, చూచుచున్న వారిమెచ్చుకై హాహాకార రవంబులె సంగఁ జేసెను.

రాజేంద్రా! కృష్ణుఁడప్పుడక్కపట నృపతింజూచి భీముండు నావలేదనియు, నతనికై నగవంబని లేదనియు, నతండు విఱిచినది భీమ ప్రతిరూపమైన యినుప బొమ్మ యనియు నెఱింగించి, "రాజా! పుత్ర శోకార్తుఁడవై యేల యిట్లనర్థము సేయఁబూనితివి? ఇది నీకుఁదగునా? భీము నేల? పాండవుల నెల్లఁ జంపినను నీకొడుకులు లేచి రాఁగలరా? నీయపనయంబును, నీకొడుకుల యుద్ధారంభమును దలఁచి, శాంతిబొంది, నీతమ్ముఁడగు పాండురాజు కొడుకులయెడ సౌమ్యబుద్ధిగల్గు" మనిహితంబు సెప్పెను. ధృతరాష్ట్రుఁడు తన్నుఁదాన నిందించుకొని కృష్ణమూర్తిం జూచి,

క॥ తెలిసితి నీమాటలఁబు
త్రుల దెసనెవ్వగల నెల్లఁ డొలఁగ, యనుజపు
త్రుల నాకుఁ బ్రియము మొనర్పం
గలవారుగ నడచువాఁడఁ గంసారాతీ!"

యని, భీమసేనాదుల నెల్లఁ గ్రమంబుగా నాలింగనము సేసెను.

పాండవులంతఁ గృష్ణపురస్సరులై గాంధారిం జూడఁబోయి సవినయంబుగా నాదేవికి మ్రొక్కి నిల్చిరి. అప్పతివ్రత కోపావేశంబునఁ బాండవాగ్రజునకు శాపమీయ నెంచెను. త్రికాలవేదియగు బాదరాయణుఁ డరుదెంచి, సత్వరముగాఁ గోడలి పాలికివచ్చి, యుచితవాక్యముల దానిమనోవ్యథ యడంగఁ జేసిన, గాంధారియుఁ బ్రీతచిత్తయై పాండవులయెడ బిడ్డల నెయ్యము పూనెను. భీముఁడా దేవికప్పుడు తనప్రతిజ్ఞను దలంచి దుర్యోధనుని తొడలు విఱుగ నేసిన వాఁడనియు, దుశ్శాసనుం జంపి యతని నెత్తురు నిజముగాఁ ద్రావక, చూచువారలకు వెఱపు గొలుపఁ బెదవిఁ జేర్చి సభలోఁ జేసిన బాసకై త్రావునట్లు నటించిన వాఁడనియుఁ జెప్పి యిట్లనియె.

తే. "అన్యజనముల శోణితమైనఁ ద్రావ
బుధికి తగునె మనువిందు, ననుజరక్త
మాన నేనుగా వెఱ్ఱినె? యంతపాప
నిఘ్నుఁడనె? తల్లియంత నిష్కరుణమతినె?"

అంధులును వృద్ధులునగు దంపతులకు నూఁతకోలగా నొకనినైన జీవింపఁ జేయక, నూర్వురుకొడుకుల మడియించిన యమరాజతనయుని పైన గాంధారరాజతనయ కోపించి శాపంబీయ నుద్యోగించిన, ధర్మరాజా దేవిని సమీపించి వినతుఁడై చేతులు మొగిచి,

క॥ "నీపుత్రులఁ జంపించిన
పాపాత్ముని గ్రూరచిత్తుఁ బరివాదార్హున్

శాపంబునఁ బోలియుంపుము
భూపాలకవల్లభాభి పూజితచరణా."

యనియు, బంధుద్రోహియగు తనకు మహిమేల రాద నియుఁబల్కెను. ధృతరాష్ట్రమహిషి కోపముడిగి ప్రసన్నచిత్తయై, ధర్మపుత్రాదులను గుంతీదేవిని జూచునట్లు నియమించెను. అంతవారు పాంచాలీసహితులై తల్లికి మ్రొక్కిరి. అయ్యమకొడుకులను గౌఁగిలించుకొని, కోడలినూరార్చి, యుందఱతో గాంధారియొద్దకు వచ్చెను. ద్రౌపది గాంధారికి మ్రొక్కి పుత్రశోకార్తయై వెక్కివెక్కి యేడ్చిన, నాదేవియుఁ గోడలిం జూచి "అమ్మా! నీవిట్లువిలపింప నిన్నుఁజూచి పాండవులును గుంతియుఁ బాగులకుందురా? విధివశంబున మనయిరువురకు నొక్క విధమగు కీడయ్యెను. నన్నునీవును, నిన్ను నేను నూరార్పఁదగుదు" మని యుపశమించునట్లు పలికెను.

(3) కురుకుల క్షయమునకుఁ గ్రుద్ధయై గాంధారి కృష్ణునకు శాపమిచ్చుట.

రాజేంద్రా! వినుము. మహాపతివ్రతయు,శుభచరిత్రయు, సత్యవచనయునైన గాంధారికప్పుడు పరాశర సుతునికరుణచే దివ్యదృష్టికలుగ, నమ్మహాదేవి నేత్రపట్టము ధరించియుండినను నధికవిస్తారమగు రణరంగమంతయుఁ జూడనేర్పుగలదై, సృగాల వృకకాక గృధ్రాది మృగపక్షిజాతులచే ననవరతంబుఁ దినఁ బడుచు, ఘోరవికార స్వరూపములై పడియున్న దుర్యోధన దుశ్శాసన కర్ణశకుని సైంధవాభిమన్యు శల్యభూరిశ్రవబాహ్లిక విరాటపాంచాలాది భూపాలురశవంబులు గనుంగొని, దుఃఖితస్వాంతయై, చెంతనున్న దైత్యాంతుంజూచి, యతనికిఁ దెగిన వారి విక్రమంబును రణప్రకారంబును జెప్పుచు, నయ్యో శవం

బులం జుట్టిముట్టి విరిదలలతో నతికరుణంబుగా నేడ్చుచున్న ప్రేతబంధువులగు స్త్రీజనంబులం జూపుచుండెను.

అప్పుడా దేవి నిజపుత్రశతంబు నిరవశేషంబుగాఁ దెగుటనుదలఁచి, కోపపరీతచిత్తయై వాసుదేవున కిట్లనియె. "కృష్ణా! నీవు సర్వశక్తియుక్తుఁడవు. మాననీయవాక్యుఁడవు. అయినను నీవీజ్ఞాతుల పోరితముడుప లేకుంటివి. దుర్యోధనుం జంపునెపంబున సకలభూపాలురను గూల్చితివి. ఎల్లభూములు పాడయ్యెను. ఈకురుకులము క్షయమొందినట్లు నీజ్ఞాతులగు యాదవులును దమలోఁ బోరుచు నన్యోన్యనిహతులై పోలియుదురుగాక. ఇప్పుడు దుఃఖమనుభవించు కౌరవ కాంతలవలె, నప్పుడు యాదవ వధూజనములు బంధువులం దలంచి శోకింతురుగాక. నీవు ను నేటికి ముప్పదాఱవనేఁడగు దినమున దిక్కుసెడి మ్రుక్కి, మృత్యువు నొందెదవుగాక. ఇది నేను నీకిచ్చిన శాపముసుమ్మీ"

అని యిట్లు కుపితస్వాంతయై పల్కు గాంధారి కోపు పల్కులు విని యెదలోనుల్కి పాండవులు వడవడ వణకుచుండిరి. అవ్వనితంజూచి నవ్వుచు వాసుదేవుఁడిట్లనియె. "అమ్మా! నాకు నీవిచ్చిన శాపము ముందే దుర్వాసమునివర్యునిచే నీయఁబడినది కావున, నీవు ద్రొక్కిన నేలనే త్రొక్కితివికాని, క్రొత్తగానేమి చేయఁగల్గితివి? బలదర్పితులగు యాదవులన్యులచే వధ్యులుగామిచే, వారు పరస్పరనిహతులై చెడుదురుగాక. అది యట్లుండనిమ్ము. రారాజు దుర్వినయము నెవ్వరికిని మాన్పఁదరము కాకపోవుటను విచారించి, శోకముడిగి వలయుకార్యమునకుఁ దొడఁగుము. రాచకూఁతులెందును యుద్ధనిరతులగు

కొడుకులం బడయఁగోరుటరుదా? వీరమాతవగు నీకీశోక మేల?"

కృష్ణుని పొడుపుమాటలువిని గాంధారియు నిరుత్తరయై యూరకుండెను.

(4) తిలోదక ప్రదానసమయమున ధర్మరాజు కర్ణుఁడన్నయగుట యెఱిఁగి పరితపించుట.

కౌరవ వంశాగ్రణీ! అంత ధృతరాష్ట్రుని పంపున ధర్మరాజు మృతులైన సోదరాది బహుబాంధవుల కగ్నికార్యము సేయనెంచి, యజ్ఞాంత స్నానానంతరము మొదలుగా మఱియుఁ దనయొద్దకువచ్చి చేరియున్న సౌమ్యుఁడగు ధౌమ్యుని నప్పని కై ప్రార్థించిన, నప్పురోహిత ముఖ్యుఁడు సూతజనులయొక్కయు, హస్తిపురినుండివచ్చిన విప్రసంఘములయొక్కయు సహాయము గొని, వేత్వేఱఁ బెక్కుకట్టెలును, దునియనైపడియున్న తేరుల చెక్కలును బ్రోవిడి, దుర్యోధనాదులకెల్ల దహనకృత్యములు యథాశాస్త్రవిధి నెరవేర్చెను. అప్పుడు తిలోదరుల మేదురరోదన నినాదములును, విప్రుల వేదాధ్యయన రవములును, బెల్లైగయు పొగతో గగనభాగం బాక్రమించెను.

తదనంతరము ధర్మపుత్రుఁడు సోదర ధృతరాష్ట్ర సకల స్త్రీ జనంబులతో గంగాస్నానమాచరించి, తెగినవారికిఁదిలోదక విధులుగావించుచుండెను. అప్పుడు పుత్రులం గనుంగొని కుంతీదేవి శోకాక్రాంతయై కన్నుఁగవనశ్రులురాల నిట్లనియె "అయ్యలారా! కర్ణుఁడు రాధేయుండని యెల్లవారును జెప్పుటచే మీరు నట్లే తలంచితిరి. వాఁడు నాకుఁ దొలిచూలగుట మీ

రెఱుఁగరు. సూర్యునిదయచే లలితకవచ కుండలాభి రామమగు
మూర్తితో నాకాతఁడు మొదట జన్మించెను. వీఁడును ధార్త
రాష్ట్రులకును సఖుఁడగు సమ్మహానుభావునకు మీరునువ్వ
నీళ్ళిచ్చుటొప్పును." అని యిట్లు కర్ణుని జన్మప్రకారము ప్రకా
శముసేసిన కుంతీదేవి పల్కులువిని. పాండవులు పశ్చాత్తాపానల
దగ్ధమానసులైరి. భీమపార్థులొండొరుల మొగంబులు సూచు
చుండిరి. ధర్మనందనుఁడు పరమ నిర్వేదపరుఁడై తల్లింజూచి,

సీ. "అనిలజార్జునులమార్కొననేర్చె నెవ్వని
యుత్సాహమూఁదిసుయోధనుండు
వైదేహపాండ్రాదవసుధేశులెవ్వని
కడిమిసొంపునకరిగాఁపులైరి
మనసైన్యకోటియెవ్వనిబాహువీర్యసం
పదకోడియుండెంతెనోగుడుచుండు
నద్భుతంబొనరించెనమరులకెవ్వని
యనసమానవివిధదివ్యాస్త్రమహిమ
తే. మమ్మునందఁజననవ్వనిమహితశక్తి
యెక్కుడై సంగరంబునఁజిక్కుపఱిచె
నట్టికర్ణునిఁగొంగునసగ్నిఁదాఁచి
నట్టులెమ్మోయిదాఁచితోయమ్మచెపుమ.

తల్లీ! నీవు కర్ణుని పుట్టుకను వెలిచేయమిచేమాకింత
దుఃఖ మనుభవింపవలసె. అభిమన్యు ద్రౌపదేయ ధార్తరా
ష్ట్రులమరణంబుకంటెను మహావీరుఁడగు కర్ణునిచావు బంధు
వులకెల్ల మహాసంతాపకారియయ్యెను. అతఁడన్నయగుటమే

మొఱఁగిన నింతపుట్టునా?" యని బహుప్రకారంబుల విలాపించి మార్తాండనందనుఁడగు కర్ణునకు సోదర ధృతరాష్ట్రులతోఁ దిలోదకమిచ్చి, యతనివలని నెయ్యంబువలన నతని భార్యల నెల్ల రావించి గౌరవించి, యాతని కూర్ధ్వలోకహితంబుగోరి, సవిశేషంబగు దక్షిణలతో బహువిధ పుణ్యకర్మము లాచరించి కృతకృత్యుఁడై వెలింగెను. కర్ణుఁడు పాండవ జ్యేష్ఠుఁడగుటను విని, కౌరవ స్త్రీలెల్లను సమ్మహోత్కర్షఁ దలంచుచు, మహారాజంబుగా నేడ్పుకలుంగులు నిగిడించిరి. అంత ధర్మరాజు సకల బంధుమిత్త్ర పరిజనంబులతో గంగానది దాఁటెను.

ఇది స్త్రీపర్వ కథాసంగ్రహము.



శ్రీ

శుభమస్తు.

# బాలభారతము.

## XII. శాంతి పర్వము.

—: (1) ధర్మరాజునకు మునులు మనస్తాపోపశమనంబు సేయుట. :—

వైశంపాయనుఁడు జనమేజయున కిట్లనియె.

రాజేంద్రా! ధర్మనందనుఁడు సకల బంధువుల కుదక కర్మంబాచరించి, గంగానదీతీరమున సోదర ధృతరాష్ట్ర విదుర కృష్ణ సర్వభరత భార్యాసమేతంబుగా, నశుచిత్వంబ పనయించుటకై యొక్కనెల వసించెను. అప్పుడు వేదవ్యాస నారద ప్రభృతులైన దివ్యమునీంద్రులాతనికడకువచ్చి యతనిచేఁ బూజితులై సుఖగోష్ఠినుండ, నందఱి మహాత్ముల యభిప్రాయ మెఱింగించువాఁడై నారదుఁడు ధర్మనందనున కిట్లనియె.

శా. గోవిందుండనిశంబుశోభనమెదం గోరంగఁ, బార్థుండు ద
ర్పావేశోజ్జ్వలబాహుసారమహనీయస్ఫూర్తిశోభిల్ల గాం
డీవోల్లాసవిభాసియై సమరపాండిత్యంబు వాటింప, సం
భావింపంజగమెల్లరాజ్యమిటులొప్పంగొంటె రాజోత్తమా.

యుధిష్ఠిరుఁడు బంధువియోగదుఃఖితుఁడై జ్యేష్ఠభ్రాత యగు కర్ణునిం జంపించి నందులకుఁ దన్నుఁదాన నిందించుకొని పరమ నిర్వేదనపరుఁడై యుండ, నతని కమ్మహర్షి కర్ణుని చరిత్ర

మును, నతఁడుపోయిన పోకలును; రణములో నాతని తేరుచక్ర ము గ్రుంగుటకుఁ గారణమునుదెల్పి, యవ్వీరుని చావునకు హేతువులుగా నిట్లనియె.

చ. వినుము నరేంద్రవిప్రుఁడలిగెన్, జమదగ్నిసుతుండు శాపమి
చ్చె, నమరభర్తవంచనముసేసె, వరంబనికోరికుంతిమా
న్చెనలుక, భీష్ముఁడర్థరథుఁజేసియడంచెఁ, గలంచెమద్రరా
జనుచితమాడి, శౌరివిధియయ్యె, నరుండటుచంపెఁగర్ణునిన్.

ధర్మనందనుఁడు శోకవ్యాకులుఁడై సమీపముననున్న కుంతీ దేవిం జూచి, కర్ణుని జన్మంబది వెలిపుచ్చమిచేఁగదా యంతవుట్టెనని విచారించి, లోకములో స్త్రీలకు రహస్య రక్షణ శక్తియిక లేకుండుగాక యని శాపమిచ్చి, తమ్ములతో బాంధ వద్రోహియగు తనకు మహిమేలు టొప్పదనియు, రాజ్యపరి త్యాగము సేసి కానలకేగి ముని వృత్తినుండుటయే మేలగునని యుఁజెప్పెను. ద్రౌపదీ నకులార్జును లాతనికి దుఃఖోపమశ మనముగాఁ బెక్కుభంగుల రాజధర్మముయొక్క మేలిమింగూ ర్చి చెప్పి, గృహస్థ ధర్మనిరతులైన పుణ్యులకుఁ బడయఁజాలు నట్టిమహోన్నత పదంబు సన్యాసులకుఁ బడయరాదని తెల్పిరి. పరమజ్ఞానసంపన్నులైన దేవస్థాన వ్యాసాదిమహర్షులును, గురు కులవర్యునకుఁ దెలివొందునట్లు దండనీతి మహిమ యెఱిఁగించి, రాజ్యభారవహనమునకుఁ బూనునట్లుపదేశించిరి.

ఎవ్వరెంత చెప్పినను ధర్మజునకు మదిలో శాంతియొద వలేదు. శ్రీకృష్ణుఁడప్పుడాతనికి షోడశ రాజులచరిత్రంబు సెప్పి, యెట్టివారికైనను దనువు శాశ్వతము కాదని యెఱిగించి,

తే. "ఒప్పుకున్నను నాత్మకు లోకకర్మ
మూర్ధ్వగతిఁ జేర్చుఁ బరకర్మ మొప్పెనేని
నార్యజనములు కిల్బిష మండ్రు దానిఁ
గాన నడపుము నిజవంశ కర్మమధిప;"

యని, స్వకర్మావలంబనమే రెండులోకములయందు నరులకు శ్రేయఃప్రాప్తిగావించుననియెను.

అప్పటికిని ధర్మరాజునకు మనము కుదురలేదు. వ్యాసమునీంద్రుఁ డప్పుడా రాజేంద్రునితో నిట్లనియె.

చ. "మనుజులు సేయ నెవ్వరు? సమస్తము
నీశ్వరు నాజ్ఞఁ జెల్లెడు
న్వినుము కుఠార పాణిధర నీరుహముల్
నఱకంగఁ బాపమొం
దునొకొ కుఠారముల్, జనులు దోసముఁ
బొందరు కర్తయీశ్వరుం
డని యెడు నిశ్చయంబు దృఢమై మది
నిల్పినఁ జాలుభూవరా॥

రణంబులోఁ బలువురం జంపించినవాఁడని నీకు దుఃఖింపనేల? యుద్ధము సేయుటయు, దుష్టుల దండించుటయు క్షత్రియుల కేల యధర్మమగును? రాజులకుఁ బ్రజారక్షకంటె ముఖ్యమైనధర్మము లేదు. తమతమ తప్పుల ననేకులు చావునకుఁదగ్గయైన యుద్ధములో నిహతులైరి. నీవు వారికై చింతించుటొక వెఱ్ఱి. పుడమి రక్ష విడిచి యడవికిఁబోయె దననుట రెండవ వెఱ్ఱి.

మనంబులోఁ బాపశంక గల్గెనేనిఁ దగిన ప్రాయశ్చిత్తములు సేయుము. జన్నములు గావించి, పుణ్యాత్ముండవు గమ్ము. దా

నధర్మములు సేయుము. రణనిహతులైన రాజుల దేశంబు లేలుటకై ప్రభువులుగా వారి కొడుకులం బ్రతిష్ఠింపుము. కొడుకులేనిచోటం గూంతు నిల్పుము. దానిచే నీకుయశంబును బుణ్యంబును గల్గును. నీమనంబులో జనించిన కరుణయు నిన్ను శుద్ధునిగాం జేసెను. నీకుం జపమేల? సకలకురురాజ్య పట్టాభిషేకమనుభవించి, కురుపితామహుండైన భీష్ముని వాలికిం బోయి, యతనిచే నీ మనోగతంబులైన సంశయంబులు వాయ, బహువిధములైన ధర్మము లెఱుంగుము. అతండు మహాధర్మజ్ఞులలో నగ్రగణ్యుండు. అతనిచే నెఱింగిన నీకుం జిత్తశాంతియగును."

అనియిట్లనేక విధముల మునీంద్రుండు సెప్పధర్మ రాజు కలంక దేఱి, పుడమియేలుటకొడంబడి, రాజవేషము ధరించి యందఱితో మహా వైభవంబు మెఱయం గరిపురంబునకుం బ్రయాణమయ్యెను.

## (2) ధర్మరాజు పట్టాభిషేక మహోత్సవము

రాజేంద్రా! హస్తినాపురంబులోని జనులు ధర్మపరులైనపాండవుల రాకను విని సంతోషించి తగినవిధంబున వారినెదుర్కొని పురప్రవేశంబు సేయించి, పాండవాగ్రజుని పట్టాభిషేకమహోత్సవంబు సూడ రమణీయాలంకృతమైన పెద్దకొలువు కూటమునకు వచ్చిరి, నానాదేశాధీశ్వరులును, వ్యాసాది దివ్యమహర్షులును, సదాచార సంపన్నులైన విప్రవర్యులును వచ్చి, సభలోం దగిన చోట్లనుండిరి. పురోహితుండైన ధౌమ్యుండు విధ్యుక్త ప్రకారంబుగాం బట్టాభిషేకమునకు వలయు

సంస్కారములు గావించి, యుజ్వల మాల్యానులేప వస్త్రభూ
షణాద్యలంకృతుఁడైన ధర్మరాజును దోడ్కొని, కనకరత్న
మయంబును దృఢపాదంబునునైన భద్ర పీఠంబుపైనునిచి,
శోభనాలంకృతయైన పాంచాలిని దదీయవామ పార్శ్వంబున
సుఖాసీనఁ గావించి హోమకార్యమునకుఁ బూనెను.

అంతశుభముహూర్తంబున చక్రధరుఁడు నిర్మలగంగా
జల పూరితంబును, సుమంత్రార్చితంబునునైన శంఖమెత్తి
యాపృథాసుతుని బృథివికధిపతిగా నధికప్రీతితో నభిషేక మొ
నరించెను. ధృతరాష్ట్రుఁడును, దక్షిణ రాజవర్యులును, ప్ర
కృతి జనులలోఁ దగువారును, వేత్వేఱ రత్నమయకలశ జలం
బుల నమ్మహీపతి నభిషేకించిరి. అప్పుడు మంగళవాద్య ఘో
షములును, విప్రులయాశీర్నాదంబులును, మహీజనుల స్తుతి
రవంబులును, నొక్కటై యని వార్యముగాఁ జెలంగెను. అ
ట్లుమహావైభవమున ధర్మరాట్సుతుఁడు సామ్రాజ్య పదస్థుఁడై
భూసురదీనానాథ జనంబులకు ధనంబులిచ్చి, పట్టాభిషేకమున
కువచ్చినవారి నెల్లఁ దగిన విధంబున సంభావించి పంపెను. అం
తశ్రీకృష్ణునింజూచి యతఁడు మహాత్మా! నీప్రసాదమున నాకుఁ
బైతృకమై తామ హంగైన రాజ్యము సమకూరెను. మమ్ము
నీవు బావలు మఱదులని మన్నించుచుండుటచే, మేమునీయెడఁ
దేఁకువలేక వర్తించితిమి. దానికి సహింపవలయును. నీ మహి
మ మెఱింగి పొగడ నెవ్వరికి శక్యము?

క. ఆదిమపురుషుఁడ వగుటను
వేదంబులు సెప్పు, నవియు వెఱచుఁబలుకఁగా

నీదృక్ప్రకారుఁడని, దా
మోదర! నీవెంపెఱుంగ నోరులకలవియే.

క. దురితములఁ జెఱుప శుభములఁ
బెరిగింపం జాలునట్టి పేరులు నీకుం
బురుషోత్తమ కడుఁ బెక్కవి
పరమార్థద్యోతకములు భావింపంగన్"

అని పలువిధంబులం బ్రస్తుతించెను. కృష్ణుడు పరమ ప్రీతుఁడై ధర్మరాజును బొగడెను. పాండవులు హస్తిపురిలో రాజ్యము సేయుచు, దృతరాష్ట్ర గాంధారీకుంతీ విదురయు యుత్సంజయులకుఁ దగిన విధముల సంప్రీతియొనర్చుచు, సక లప్రజానురంజనముగావించుచుండిరి.

(3) ధర్మజాదులు శ్రీకృష్ణునితో భీష్మునియొద్దకుఁ బోవుట

అటయుద్ధరంగములో శరతల్పగ తుండైన శాంతనవుఁ డు శ్రీకృష్ణమూర్తిని ధ్యానించుచుఁ, బ్రాణవియోగమున కు త్తరాయణంబురాకకు వేచికొని యుండెను. అతనిం జుట్టు కొని మహామునీంద్రులుండిరి. కృష్ణుఁడప్పుడు ధర్మ రాజా దులం దోడ్కొని యమ్మహామహునిం జూడవచ్చి.

చ. "దమమును, సత్యముందపము, దానము
వేదములందుఁజూపవే
దమునను గల్గునై పుణియు, ధర్మవిధి
జ్ఞతయున్, విరోధిభూ
రమణవిమర్దన క్రమవిరాజిత
శౌర్యము, నీకుఁబోలెనై

జములగువాఁడు వేఱొకఁడు శంతను
నందన పుట్టెఁడెన్నఁడున్.

క. "వేయేలసంభవించునె
సాయకతల్పమునుండి చానఁగనొల్లన్
నాయిచ్ఛఁగాక యనునరు
డేయుగమునఁజూడ వినఁగ నెచ్చటనైనన్"

అని యాతనింగొనియాడి, ధర్మజునకు ధర్మోపదేశము గావించునట్లు నియమించెను. భీష్ముఁడప్పుడు "కృష్ణా! నీవే యీ కురుపతికి సర్వంబుజెప్పరాదా? నాకు బాణవేదనచే మనము వశముగాకున్నది. ఎలుంగును నాలుకయుఁదగినట్లు వర్తింపమిచే భాషాశక్తి గీప్పుడియున్నది. ఏనెట్లుచెప్పఁగలను? అదియునుంగాక నీవుండ నేను సెప్పుట, గురుఁడుండ శిష్యుఁడుసెప్పిన విధంబగును గదా?" యని ప్రత్యుత్తరమిచ్చెను భక్తార్తిహారుండైన హరియప్పుడు, గాంగేయున కంగముల వేదనలేకుండను, మూర్ఛయు, డప్పియు, నాఁకలియు, నీరువట్టును బొరయకుండునట్లును, బుద్ధిచలితముగాక స్థిరమై యుండునట్లును వరంబులిచ్చెను. కృష్ణప్రసాదమున సుఖియై శాంతనవుఁ డాపాండవాగ్రజున కనేకధర్మము లెఱిఁగింపఁబూనెను.

—:(4) భీష్ముఁడు ధర్మరాజునకు రాజధర్మము లెఱింగించుట.:—

రాజేంద్రా! మహాప్రాజ్ఞుండగు శాంతనవుఁడు కౌంతేయాగ్రజునతి ప్రీతితోనాదరించి యిట్లనియె. "ధర్మనందనా! రణంబులో బంధువులంగూల్చిన వాఁడని నీకు దుఃఖింపనేల? రాజులకు యుద్ధముసేయుటయు, శత్రువులఁ [illegible] రాజ్యము

గొనుటయు,దుష్టులశిక్షించుటయు, సాధుజనులఁ బ్రోచుటయుఁ బరమమైన ధర్మములు. ఏనుంగునందలో నెల్లజంతువుల యడుగులు లోనగునట్లు, రాజధర్మములో సకలవిధములైన ధర్మములణగియుండును.స్వకర్మనిరతుఁడైన రాజురక్షణంబు వడసిగదా, సకలజనులును వర్ణాశ్రమాచారవిధులు దప్పక ప్రవర్తించి సద్గతి వడయఁజాలుదురు?

క. పేదలకును సాధులకును
వేదములకుఁ దాపసులకు వేయేలసమ
స్తాదిత్యులకును దండమ
కాదె బ్రదుకుఁజేయురాజుగావింపంగన్.

కామక్రోధాదులం బొందక సమవృత్తి దండనీతిని వెలయఁజేయు రాజువడయు సుగతిని నితరులు వడయలేరు. సర్వ లోకములు ధర్మములు నృపాల ధర్మమూలములని బృహస్పతి మున్దు వసుమనుండను నరేంద్రున కుపదేశించెను. రాజు దేవతాసముఁడు. చారచక్షుఁడై జగంబులం గనుగొనునప్పుడతని సూర్యుఁడందురు. దుష్టుల శిక్షించునప్పుడు జముఁడందురు. పరుసదనముతో జనులచే నరిగొనక "కోరితోఁటవాఁడు కుసుమ ఫలంబులు గోయునట్లు", ప్రజలచే నరిగొనుచు, దయతో వారిని గన్నబిడ్డలవలె నరయురాజు జయమును, శ్రీయును, కీర్తియును, బెంపును, సుగతియును బడయజాలును. ఎట్టి రాజునకు శుభంబు లొడఁగూడునో యెఱింగించెద, వినుము,

శా. అరయుందప్పకృతంబెఱుంగు, మదలోభావేశముల్ లే, వము
ష్కరుఁడాత్మస్తుతి లేదు,సేయునియతింగార్యంబు,లీగుల్ ఘన

స్థిరముల్, శూరుఁడు, గర్విగాఁడు, శఠుఁడు, స్త్రీలోలుఁడు, క్రోధనుం
డరినోర్వంగానఁ డన్వాగత్తఁగను రాజత్యంతదీప్తుఁడగున్.

ధర్మనందనా! రాజునకు మంత్రి కార్యజ్ఞుఁడును, సర్వజన సమ్మతుండును, ధైర్యశౌర్యాది గుణములు కలవాఁడును, బతియెడ భక్త్యనురాగ సంభ్రమములు గలవాఁడును, శుద్ధాత్ముండైనవాఁడునుగా నుండవలయును అల్పబుద్ధులును దుర్మార్గులును, నేరని వారునైన మంత్రులును, బరిజనంబులును రాజునకుఁ గీడాపాదింతురు.

ఉ. క్రూరులు, లోభులున్, శఠులు, గొండెయలున్,
జడులుం, గృతఘ్నులుం,
నేరని వారు, బొంకునకు నింపకు
నోర్చిన దుష్ట బుద్ధులున్
ధీరత లేని దుర్నయు, లతి
వ్యసనత్వము గల్గువారలున్
జేగుననున్కి భూపతికిఁ జెట్ట
యొనర్చు నరేశ్వరోత్తమా.

దుర్మార్గులైన జనులు హితులగు మిత్రులను గపటోపాయంబులఁ జెఱుపఁజూతురు. కావున రాజు దుష్టులగు మంత్రుల కఱపులఁ బడక, వీరు సౌమ్యులు వీర సౌమ్యులని యెఱిఁగి ప్రవర్తించుట మంచిది. కులహీనులైన వారిని జేర నీయరాదు. కులముగల వారినైనను దుష్టులైనచో దూరముగా నుంచవలయును. సేవకుల యుత్తమమధ్యమ హీనత్వము లెఱిఁగి వారివారికిఁ దగిన పదముల వారిని నిలుపుటయే రాజులకు యుక్తమైనది.

రాజులకు నమ్మఁదగనివారిని నమ్మరాదు. నమ్మఁదగిన వారినైనను విశేషముగా నమ్మియుండఁ జనదు. తన్నితరులునమ్మునట్లు నడచుకొని, తానితరులనమ్మకుండుటయే నీతి. తనకుమేలాచరించు మిత్రులచేఁ గార్యములు నడపుచుఁ దానన్నిటియందును గన్నిడిమెలంగ వలయును.

క. తనయుఁడైనను నమ్మిన
జనపతిసిరిగోలు పోవుఁజతురత మైన
మ్మినవాఁడ పాలెనమ్మక
యునికిసకలజనులయెడలనురవైయుండున్.

రాజులకును రాజసేవకులైన న్యాయాధికారులకును బ్రజల వివాదంబు దీర్చునెడఁ, బక్షపాత ముడిగి, త్రాసులంబోని చిత్తములుగల్గి, వీరు ధనికులు వీరుపేద వారనక న్యాయాన్యాయము లెఱింగి, నేర్పునఁ దీర్పు సెప్పవలయును. వ్యవహారశుద్ధి గల్గుటయే సర్వజన ప్రియకారియగుటకు మూల మగును. పరీక్షావిశుద్ధి పూర్వముగ దండనీతి వెలయఁజేయు రాజును రాజందురు. దండార్హులైన వారిదండింపమియు, నిరపరాధుల దండించుటయు, దగని దండము విధించుటయు మహాపాతకములు. పరుషదండము విధించుట సప్త వ్యసనములలో నొక్కటియందురు.

తే. వెలది, జూదంబు, పానంబు, వేఁట పలుకు
ప్రల్లదంబును, దండంబు పరుసదనము,
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేత,
యనెడు సప్తవ్యసనములఁ జనదుతగుల."

## (5) భీష్ముఁడు ధర్మరాజునకనేక సామాన్య ధర్మవిశేషంబు లెఱింగించుట.

జనమేజయభూపతీ! అట్లనేకప్రకారంబుల రాజధర్మము లెఱింగింపవిని, ధర్మనందనుఁ డమందానందంబు బొంది మందాకినీ నందనుం జూచి, "మహాత్మా! ధర్మములలో నెయ్యవి శ్రేష్ఠంబులు? ఎయ్యవి యాచరింప జనులకు సుఖంబుగలుగును? అన్ని ధర్మములలో నవశ్యానుష్ఠేయములైనవి యెవ్వి?" యని యడిగిన నారాజవర్యునకు భీష్ముఁడిట్లని చెప్పఁదొడఁగె.

"శాంతేయాగ్రణీ! ఎల్లజనులు నాచరింపఁదగు ధర్మములనేకములున్నవి. అవి వేదవిహితములు, శాస్త్రవిహితములు, శిష్టాచారములని మూఁడువిధములు. అవియన్నియు సద్గతికి హేతువులేయగును. దానధర్మములు సేయుటయు, ఆశ్రితులను శరణాగతులను దీనులనుబ్రోచుటయు, సాధువులఁగూడుటయు, గురుజనంబుల సేవించుటయు, సత్యమార్గము దొలంగమియు, నితరులకు హింసగావింపమియు, నింద్రియంబుల వెంటఁదిరుగక వానిని వశ్యంబులు గావించుటయు, నతిథిజనుల నారాధించుటయు, క్రోధకామాది దుర్గుణంబులు వదలుటయు, నాస్తికులు దుర్జనులు మొదలగు హీనులంగూడమియు, సంప్రాప్తమైన దానిఁ బదివేలుగాఁదలఁచి తృప్తిబొరయుటయు, సుఖదుఃఖములు గల్గినపుడు చిత్తసమత్వంబు గల్గుటయు మొదలగునవి యెల్ల సర్వజనానుష్ఠేయమైన ధర్మములు. వానిచే జనుల కిహపరంబులు రెండును సమకూరును.

తే. ఇందుఁ జేసినపుణ్యంబు నందుఁగుడుచు
మీఁదిజన్మంబునకు నదిమేలుసేయుఁ

గానఁదనశక్తితోఁ గూడదానధర్మ
చిరపరోపకారంబులు సేయవలయు.

ధర్మనందనా! శరీరమనిత్యము గనుక నెల్లిచేయఁదలం
చిన పుణ్యకార్యములు నేఁడే చేయుటొప్పును.

గీ. జరయుమరణంబు మర్త్యునిజన్మమాది
గాఁగ నెనువెంటఁ దగులునంగంబువేచి
యెల్లిచేసెదననకమే లిపుడుసేయు
మనఘ! యొప్పునెమృత్యువు జనులపనులు.

శరణాగతరక్షణము ధర్మములలో మేటిగా నెన్నఁబడు
చున్నది. దానిమేలిమి యెఱింగించునొక పుణ్యకథవినుము.
పూర్వము క్రూరాత్ముఁడైన కిరాతుఁడొక్కఁడు వనంబులోఁ
బెనుగాలివానకు జడిసి, తడిసి చలిచే నడవడవణకుచు, నొక
పెద్దవృక్షంబుసేరి, యందలి పక్షులనాశ్రయించి తన్నురక్షించు
నట్లు ప్రార్థించిన, నాచెట్టుతొఱ్ఱలో నుండునొక కపోతమాపక్షి
విధ్వంసకునకుఁ బొడసూపి, యతనికి శీతబాధతొలఁగు నట్లొడల
కాఁచికొనుటకై యనలంబు దెచ్చియిచ్చి, యతిథియగు వాఁడాఁ
కలిచేఁ గుందుటను జూడలేక నిజశరీరమునే యాహారముగానీయ
నెంచి, యానిప్పులోఁబడి మృతినొందెను. బోయ విస్మయమంది
దానిం జూచి,

మ. "కలదే యిమ్మెయిపౌరుషంబుజగతిం, గారుణ్యమేపార ని
ప్పులఁగిట్టిచ్చునె మేను,నాదుచరితంబుల్ నిందకుంబట్టులై
తలఁపన్ వచ్చిననింతకీడగునె, యేతత్పూర్వ తాఘోరంచే
ష్టలుమానంగలవాఁడఁ, బక్షిగురువై సంధించెసద్బోధముల్"

అని వైరాగ్యమూనిన చిత్తముతోఁ జేతివలలోనున్న పులుఁగులవిడిచి, పక్షిమృగమారణ సాధనములెల్ల నందపడవైచి యచ్చోటువదలి చనియెను.

అంతలో బోయవలనుండి వెడలిన యాకపోతము భార్య తననాథుఁడు మృతినొందుటకు దుఃఖించి,

క. "తేనియనుమరణమునఁదన
మేనువిడిచినట్టి కాంత మేలిపదవికిం
దానునతండును నరిగియ
నూనస్థిరసుఖము లందుచుండుట విందున్."

అని విచారించి పతిందలంచుచు నిప్పునుపలగొని యందు లోఁబడి చచ్చెను.

అంతనాపక్షి ద్వయంబు సుకృతంబుకతన దివ్యరూపములు దాల్చి పెక్కుదేవతలును దేవతాస్త్రీలును గొల్వ మహనీయ మగు రథమునెక్కి స్వర్గలోకమునకుఁ బోవుచుండ, నప్పుడు పుణ్యప్రవర్తనుఁడైన యాకిరాతుఁడు దానింగని, తాను నట్టి గతి నడయనెంచి, దవానలంబుసొచ్చి యొడలుదొఱఁగి దేవత్వం బునొందెను

ధర్మనందనా! శరణుసొచ్చినవారి రక్షించుట కంటెఁ బుణ్యమైనకార్య మొక్కటిలేదు. వారిని బరిత్యాగము సేయు టచేఁగల్గు పాపమునకుఁ బరిహారము లేదందురు. కావున నీవును నాశ్రితులను దీనులను గరుణతోఁ గాపాడుము. ఎల్లభూతముల యందును దయగల్గి వర్తింపుము. హింసకు సాధ్యమైనంత దూర ముగా నడవుము. అహింసాధర్మ నిరతుఁడే పుణ్యాత్ముఁడు. వాఁడే యెల్ల ధర్మములు సేసినవాఁడగును.

క. భూతములకలుఁగునతనికి
భూతములఖిలములునలుగు, భూతహితార్థీ
భూతములకభయమిచ్చిన
పూతాత్మునకభయమిచ్చు భూతావలియున్.

(6) భీష్ముఁడు ధర్మరాజునకు మోక్షధర్మము లెఱింగించుట.

జనమేజయభూపతీ ! శాంతనవుఁ డంతకసూనున కనేక సామాన్య ధర్మము లెఱిఁగించి, విశేషధర్మము లెఱింగించు వాఁడై మఱియు నిట్లనియె. "కుమారా! అన్ని ధర్మములలో మోక్షధర్మము శ్రేష్ఠతమమైనదని ప్రాజ్ఞులైన పరాశర వ్యాస నారదాది మహామునులు సెప్పుదురు. సకలభూతములును దమ తమకర్మంబు తెరువునజనించి, ప్రవర్తించిచచ్చి, మఱియు గర్మాను గుణంబుగా జన్మించును. ఇదియే జీవుల సంసారబంధ మనఁబడును. దీనినుండి తప్పించుకొనుటయే మోక్షమగును.

క. నరుఁడెంత కాలమేనిం
బరఁగంగాముక్తిపదము బడయకయుండున్
బురుషవరయంతకాలము
పొరిపొరినీభంగిఁ జావుఁబుట్టువునొందున్.

అనఘా! కర్మఫలాసక్తులగు వారికిఁబుణ్యపాపానురూపములైన ఫలములంగుడువక పోరాదు. జీవునకుఁ బుణ్యకర్మములచే దేవత్వమును, బుణ్యపాప సంకరమున నరత్వమును, బాపకర్మనిరతిచేఁ బశుకీటాది నీచయోనిత్వమును సంప్రాప్తమగును. కావున కర్మఫలముల కాసపడక తమతమ కులోచితములైన కర్మములనుజేయుట నరులకొప్పును. మోక్షాసక్తులగు

వారు గురువుల సేవించుచు, వర్ణాశ్రమోచితములైన కర్మలు కోరికలులేక సల్పి, సుఖదుఃఖలాభాలాభ జయాపజయ మానా వమానములను ద్వంద్వములచే బాధితులుగాక, జ్ఞానంబు నాశ్రయించి సర్వత్రసమదర్శనులై వర్తించి, శాశ్వతానందంబు వడయుదురు.

క. ఇనుమును గనకము నిందయు
వినుతియు సమములుగఁ గొనుచు వివిధాంగకముల్
తనలోన నడచుకమఠము
ననువున నింద్రియములడచు నతఁడు శివుఁగనున్.

క. అనఘుదురన్నము శాల్యో
దనమును భూమియును మృదులతల్పం బజినం
బును సురుచిర చీనాంబర
మునుసరియెవ్వనికి నతఁడుముక్తిం బొరయున్.

ఆ. హింస లేకయునికి యింద్రియ జయమును
రాశ్యమచ పలత్వమను గుణములు
నాల్గుఁగల్గునట్టి నరునకుఁ గరతలా
మలకమంత రాత్మమహిమ యొల్ల.

అనఘా! ఎల్లధర్మములలోఁ గామక్రోధాదులను విడిచి సర్వభూతములందు సమబుద్ధిగలిగి వర్తించుట మేటియైన ధర్మ మనుటకు నిదర్శనంబుగా, ముందొకప్పుడు దేవసభలో నింద్రు నకు నారదుండెఱింగించిన కథయొక్కటి వినుము.

గంగానదీతీరమున మహాపద్మమను పట్టణములో జితేం ద్రియుఁడును, శాంతమూర్తియు, ధర్మవత్సలుడునైన భృగుం డను విప్రవర్యుఁడొకఁడు,భార్యాపుత్ర సమేతుఁడై యతిథిజనులకు

సపర్యలుసేయుచుఁ గాపురంబుసేయుచుండ, నొకనాఁడాతని యింటికి ధర్మజ్ఞుండైన బ్రాహ్మణుండొక్కఁ డతిథియైవచ్చి, యుచితసత్కారములంది, జనులకునుగతికిఁ గారణములైన నానాధర్మములనుగూర్చి ముచ్చటించుచు,

క. "జననీజనకారాధన
మున గురుభక్తిని సుస్నృత్తమున శాంతిని దాం
తిని సత్యమున సహింసను
వినుకాంతుఁరు మోక్షపదము వేత్త్వాఅజనుల్".

అని యెఱింగించి, పరమానంద ప్రాప్తికి హేతువులైన విశేషధర్మము లెఱుఁగుటకై, యాగృహస్థుని నైమిశారణ్యమున గోమతీతీరమునవసించు పద్మనాఁడను పేరుగల సర్పరాజుం జూడ బోవునట్లు నియమించి వెడలిపోయెను.

రాజోత్తమా! వినుము భృగుఁడప్పుడే యిల్లువెడలి బహుతీర్థములు సేవించుచు, నైమిశారణ్యంబుసేరి, పద్మని మందిరంబునకుఁబోఁగ, నాసర్ప రాజప్పుడింటలేమిచే, నతని భార్యయాతనికి నాతిథ్యమిచ్చి, తననాథుఁడు సూర్యునిరథంబు మోచుటకై పోయియున్న వాఁడనియు, నాతఁడు కొద్దిదినంబులలో మరలివచ్చుననియు నెఱింగించెను. అథ వామరవర్యుఁ డా యింటిలోనుండక చేరువనుండు వనములో నిరాహారుఁడై భుజగపతిరాకకు వేచియుండెను.

అంతఁగొన్ని దినంబులేగిన దినపతిచే ననుజ్ఞాతుఁడై యహిపతి తనమందిరమునకువచ్చి, వనంబులోనున్న బ్రాహ్మణుని వృత్తాంతమంతయు భార్యచే నెఱిఁగినవాఁడై, సత్వరంబుగా నాతనిం జూడఁబోయెను. అవ్వనంబులో నయ్యిరువురు

నొకరమణీయ శీతలప్రదేశంబునం గూర్చుండి సంభాషింపుచుం డునెడ, ధర్మము లెఱుంగ వేఁడివచ్చిన పాఱుఁడు పాఁపఱేనింగని "అయ్యా! మహాధర్మజ్ఞుఁడైననిన్నుఁ జూచునాసతోనిందువచ్చి, నీవు భానునారాధింపఁ బోవుటనువిని, వాడిన చేనివాఁడు వాన కెదురుచూచునట్టు నీరాకకై వార్చియుంటిని. నామనంబులోని సంశయంబు వాపనీవయర్హుండ" వనియెను. పద్ముఁడు సంతోషించి భృగుంజూచి "మహీసురవర్యా! పుణ్యాత్ముఁడవైన నీవు మాయింటికి వచ్చుటచే నేనుధన్యుఁడనైతిని. నీకోర్కి దీర్చుట కంటె నాకొండుపనికలదా? నీకేమికావలయునో చెప్పు" మని ప్రత్యుత్తరమిచ్చెను. భృగుఁడిట్లనియె. "సర్పకులోత్తమా! నాకోర్కి విదపఁ జెప్పెద, వేఱొక్కవిషయంబడుగ నామనంబు దత్తరపడుచున్నది. నీవు సూర్యునిరథంబు వహింపఁబోయిన చోట నీవు వినిన కనిన యాశ్చర్యమేదిగ్నయెనఁగలదేని దాని నాకు ముందుగా నెఱింగింపుము"

పద్మునఁడప్పుడా భూసురవర్యున కిట్లనియెను. "ధాత్రీసురోత్తమా! వినుము. సూర్యుఁడాశ్చర్యములకెల్ల నాస్పదమై యున్నాఁడు, భూతప్రవృత్తులకెల్ల నతఁడే మూలకారణుఁడగును. వృక్షశాఖలను విహంగము లాశ్రయించి యుండునట్లు, సూర్యకిరణంబు లాధారంబుగా వాలఖిల్యాదిమునివర్యులు వసించుచుందురు! పరముండును, నిరంజనుండును, శాశ్వతుండును నైనపరమాత్ముఁడా సూర్యునియందు వెలుఁగుచున్నాఁడు. ఇంకొకయాశ్చర్యము వినుము. నేను సూర్యుని యొద్దనుండ నొక్కనాఁడొక రవితేజుండైన పురుషుఁడు సూర్యబింబమున కెదురై యతిత్వరితగతిం బఱతెంచివచ్చెను. దినేశుఁడా పురుష

ని సంతోష సంభ్రమములు బెనంగొనఁ దనచేతులలోఁబట్టి సన్మానించెను. అంతవాఁడును గమలాప్తుని బింబము సొచ్చి యందేలయించెను. దానింగని నేను వెఱఁగంది ప్రభుంగనుం గొని, యట్లు వచ్చినవాఁడెవ్వఁడగునో యనియడుగ, సహస్రకి రణుఁడు నాపై కరుణించి నన్నుంగనుంగొని "అయ్యా! ఈతఁడు సురగరుడగంధర్వాదులలో నొక్కఁడు గాఁడు. ఉంఛవృత్తిగల విప్రుఁడునుమ్మి. మహానియమ వ్రతుఁడు. ఫలమూల నీరమా రుతాహారుఁడు. దొరకొనినవానితోఁ దృప్తివహించునుగాని, దొరకొననివానికై నోరుతెఱచి యెదురుచూడఁడు. సర్వభూత ములయందును సమతయుఁ బ్రియంబును గల్గి ప్రవర్తించువాఁడు. అట్టి మహాపురుషుఁడు నేఁడిట్లు నీవు సూచుచుండ సిద్ధిఁబొందె" ననినాకుఁ దెలియఁజెప్పెను. మహీసురోత్తమా! ఇంతకంటె నాశ్చర్యమైనది యేదికలదు?"

భృగుఁ డప్పుడా యురగపతింబొగడి "మహాత్మా! నీవు సూర్య మండలములోఁ గాంచిన యాశ్చర్యములు సెప్పినా సందేహమును దీర్చితివి. పరమసిద్ధికి మూలంబులైన ధర్మములు విని కృతార్థుఁడనైతిని. ఇంక నాకనుజ్ఞయిమ్ము; పోయివచ్చెద" ననియాతని నామంత్రణంబు సేసి తన పురంబునకుఁబోయి, యేవిధములైన కోరికలులేక సమసుఖదుఃఖుఁడై శాంతిఁబొంది సర్వభూతములయందు సమబుద్ధిగలవాఁడై యచిరకాలంబునఁ బరమసిద్ధిఁజనియెను.

ధర్మనందనా! ఈ యితిహాసమును దేవేంద్రునిచే వసువులువినిరి. వారిచే నేను వింటిని నీవు ధర్మములలోఁ బరమ ధర్మము లెవ్వి యని యడుగుటంజేసి, నీకీ భృగుపద్మల సంవా

దరూపమైన యితిహాసరాజము వినికించితిని. అన్నిధర్మములు మేలైనను, సర్వభూత సమదర్శిత్వంబును, నకాంక్షిత్వం బును, మోక్షహేతువులైన విశిష్టధర్మములనుటకు నీయితిహాస ము నిదర్శనమైయున్నది.నీవిందలి తాత్పర్యమును సంధింపుము."

క. కోరికలకుఁ జొకయసం
 గారూఢతగల్గి యెల్లయందును సమతం
 గూరిన చిత్తంబులుగల
 సారాత్మకు లీపదంబుఁ జనుటకుశక్తుల్.

ఇది శాంతిపర్వకథాసంగ్రహము.





శుభమస్తు.

# బాలభారతము.

## XIII. అనుశాసనికపర్వము



### (1) గౌతమీ లుబ్ధకభుజంగమృత్యుకాల సంవాదము.

వైశంపాయనుఁడు జనమేజయున కిట్లనియె.

“నరేశ్వరా! అస్త్రప్రాజ్ఞులలో నుత్తముండగు వియత్తటినీనందనుండు బహువిధంబులైన ధర్మంబులుపదేశింప ధర్మరాజువిని, తాతకు మ్రొక్కి “మహానుభావా! నాకుఁజిత్తోపశాంతియొనర్పఁగోరి మీరెన్నియో ధర్మవిశేషంబులు నాకెఱింగించితిరి. నామనంబులోఁ శాంతిగలుగలేదు. చలంబున బహుబంధువులను జంపించితినికదా యనుతలంపొకటి పైకెక్కి నన్నలముచున్నది. లోభగుణముచే దుర్యోధనుఁడు రాజ్యభాగమీయక పోయెను. నేనును నాగ్రహంబున నతనికే రాజ్యమిచ్చి తొలఁగిపోవనైతిని. మాయిద్దఱికతంబున నింతపుట్టె. ఏమిచేయుదు?” ననిన, నారాజపుంగవునకు గాంగేయుఁడిట్లనియె.

“ధర్మపుత్రా! బంధునాశమునకుఁ గర్తనీవుకాదు. ఒకనినొక్కఁడు సంపలేఁడు. దీనికినిదర్శనంబుగా గౌతమీలుబ్ధకభుజంగ మృత్యుకాల సంవాదమును నితిహాసంబువినుము.

పూర్వము గౌతమియను విప్రాంగననిజపుత్రుఁడు సర్పదష్టుఁడై మృతినొందుటకు దుఃఖించుచుండ, నొకకిరాతుఁ డాగ్రహమున నప్పాముంబట్టి బంధించి తెచ్చి, యప్పడతిముందరఁబెట్టి, "అమ్మా! నీసుతునింగఱచిన యుచ్చిలువను బొలియించెద" ననియె. దయావతియైన యన్నాతిజీవహింస పాతకమనియు, సర్పమునుగూల్చుటచేఁ దనకొడుకు బ్రదికిలేచిరాఁడనియు నెఱింగించి, పామును విడిచి పుచ్చునట్లుపలికెను. ఆమాట పాటిగాఁబట్టకబోయ సర్వజనబాధకములైన దుష్టకీటముల గీటడంచుట పాపముగాదని ప్రత్యుత్తరమిచ్చెను.

అట్లువారు సంభాషింపుచుండ నయ్యురుపుంజూచి యురగంబు "వినుఁడీ! నేను మృత్యుదేవతచే నియోగింపఁబడి యీబాలు నింగఱచితిని. నాకాతనిపైఁగోపము లేదు, ద్వేషము లేదు. నాపైఁదప్పు వట్టినన్నుదండింపనగునా?" యనియడిగెను. వనచరుఁడప్పన్నగంబు మాటలకొడంబడక, దానింజూచి "మృత్యువునకుఁ దగిన సాధనమైన నిన్నుదండించుట న్యాయ" మనియె. దానికప్పాము "అయ్యా! తగిన సాధనములుగాని ఋత్విజులగ్నిలో వేల్తురు. యాగఫలమును యాగకర్తయే పొందునుగాని ఋత్విజులు పొందఁగలరా? అట్లే నన్నును దలఁపవలయు"నని పల్కెను.

కౌరవనాథా! అప్పుడు మృత్యుదేవత వారికిఁబ్రత్యక్షమై తన్నెఱింగించి, పాముంజూచి "సర్పమా! నేనునిన్నుఁ బంచినట్లు నన్నుఁగాలుండుపనిచెను. కాలపురుషున కధీనములుగాని భూతము లెందైనఁగలవా? భూచంద్రార్క జలపవనాది సమస్తభూతములు గాలవశంబునఁ దెగుచుండ, దక్కిన సామాన్యభూత

ముల విషయమై చెప్పనేలఁ? కావున నీపిన్నాతని చావునకుఁ గారణము కాలపురుషుఁడే కాని, నీవును నేనును గాదు. మీకీవాద మేల'' యనెను.

తనపై మోపఁబడిననిందను బాపుకొనుటకై కాలపురుషుఁడు వారలకప్పుడు పొడసూపి యిట్లనియె. ''ఓ వెఱ్ఱులారా! మీ పిచ్చివాదమున కేమనఁగలను? ఈ బాలకుని మరణమునకు హేతువులు పామును, మృత్యువును, నేనునుగాము. వాఁడేమి పాపకర్మములు గావించెనో యవియే వాని నిప్పుడు మృతినొందించినవి. సకలజనములును దమతమకర్మల కనుగుణంబైన తెరువుగం బోవుదురు. ఇదిమీ రెఱుఁగినలదా?

క. వినుకర్మం బొనరించును
జననముమరణంబు, నదియసౌఖ్యముదుఃఖం
బునుగావించుం, దనచే
సినదానంబడకపోవ శివునకువశమే''

అనియిట్లు బాలమరణ హేతువిషయమై పొడసూపనసంశయంబుడిపి కాలుం డంతర్ధానంబుసేసిన, లుబ్ధకుఁడు తెలివొంది విప్రస్త్రీకిం బ్రియంబుగా భుజంగంబునువదలి చనియెను.

కావునధర్మనందనా! భారత రణనిహతులైన వారిచావునకు నీవును దుర్యోధనుఁడును గారణములుగారు. వారికర్మము తే వారి మృతినొందించెను. నీకు దుఃఖపడనేల''?

(2) భీష్ముఁడుధర్మరాజున కనేకహితము లుపదేశించి, యతనిపురికిఁబంపుట.

రాజేంద్రా! గౌతమీ లుబ్ధకభుజంగ మృత్యుకాల సంవాద ప్రకారమంతయువిని తెలివొంది సంతసిల్లియున్న. కొంతే

య పూర్వజుంగని, దేవవ్రతుండైన శాంతనవుండు మఱియు నిట్లనియె. అనఘా! నీవు గృహస్థధర్మ నిరతుండవై యతిథులం బూజించి కృతకృత్యుండవుగమ్ము. ఆశ్రమములలో నదియే యుత్తమము. చలిపందిరివిధముగను ఫలభరితమైన చెట్టుభంగి యు నీయాశ్రమము సకలాశ్రమస్థుల దప్పులదీర్ప నమరియున్నది. అన్నదానాది బహువిధధర్మముల నీవుసకల జనసంతృప్తికరుండవై వర్తిల్లుము.

గీ॥ క్షుత్పిపాసల చేఁ గడుఁగుందినట్టి
యతిథివచ్చినఁ బ్రియముననతనిఁదప్పి
పోవునట్లుగ సముచితభోజనంబు
పెట్టుతల్లిపుణ్యముంకుఁ బెద్దతలఁప

అతిథుల నాదరించుటకంటె గృహస్థులకు ధర్మమొండు లేదు. పూర్వమగ్నిపుత్రుండైన సుదర్శనుఁడను రాజు తనధర్మసతియైన యోఘవతియను పుణ్యాంగనతో, గృహస్థధర్మ నిరతుండై యతిథిజనంబుల వాంఛితములుదీర్చి, మృత్యువును గెల్చి, భార్యాసహితుండై మేనితో దివంబునకుఁ బోవఁగలైను. నీవునట్లే గృహస్థధర్మము జేర్మితో నడుపుము.

శాంతేయాగ్రజా! నీకింకొక్క ధర్మవిశేషము సెప్పెద వినుము. నీవెల్లప్పుడు బ్రాహ్మణజన ప్రార్థితములైన పనులు సేయుచు, వారియందు దయగల్గివర్తింపుము. వారిని దేవతలుగా భావించి పూజింపుము.

ఆ. వినుము విప్రవరులు వెడవెడఁగినిసిరే
నియనుధరణి యెల్లనిటు సేయఁ

జాలుదురు, తపఃప్రశస్తులు, దుర్వార
తేజులెంచుసనధిక ధీరమతులు.

ఆ. అగ్నినంట, హిమవదచలంబుఁగదలుప,
గంగఁగట్టవచ్చుఁగాని, విప్ర
రాజిఁబరిభవింపరాదు, విప్రులకొలుఁ
కల్పవృక్షసేవ కిరణిఁయధిప.

విప్రజన్మంబు మనుష్యజన్మములో శ్రేష్ఠమైనది. అది యనేక జన్మములెత్తి తిరుగఁగా సంభవిచును. అధ్యయనంబును, యాజనంబును, దానంబును, వ్రతనిష్ఠయు, గురుణయు, శౌచంబును, శాంతియు, సహింసయు, క్షమయు, నింద్రియనిగ్రహంబును, బ్రాహ్మణుల ముఖ్యకర్మములు. అవియేవారికిఁ బరమధనంబులు అట్టివిశిష్ట సద్గుణంబులుగల వారినే బ్రాహ్మణులందురు దానతపోనిత్య శౌచదయాదులు లేని విప్రులువిప్రులుగారు. వారు శూద్రప్రాయులై మృత్యుభయ నంగితిచే నీచమానవులగుదురు.

తే॥ పావనంబులలో నెల్ల బ్రాహ్మణుండు
పరమపావనమను శ్రుతిపౌరవేంద్ర,
యట్లుకావున భూదేవతార్చనంబు
భక్తిసంభృతముగ నడపంగవలయు.

ధర్మదేవతా తనూభవా! ఇంకొక్క విశేషధర్మము వినుము. పూర్వమొక పుణ్యావర్తనుఁడైన బ్రాహ్మణ ప్రవరుఁడొక్కెడ, నారదమహర్షింజూచి భక్తితోఁ బ్రణమిల్లి, ధర్మవిశేష మెఱింగించునట్లు ప్రార్థింప, నమ్మునీంద్రుఁ డాతనికిట్లనియె "ఓభూసురవర్యా! పరమాత్ముఁడైన నారాయణుఁడు పర

బ్రహ్మంబనఁగను, బరతత్వంబనఁగను. నీశ్వరుఁడనఁగను, విష్ణుఁడనఁగను బొగడొందుచుండును. అద్దేవునివలననే భూతసృష్టిస్థితిసంహారములగుచున్నవి.అట్టి నారాయణునిభక్తితో నెప్పుడు స్మరించుచు, నతని శరణంబువేఁడుట మనుష్యులకు ముఖ్యమైన కార్యమగును.

ఆ. సర్వశాస్త్ర వాక్యసమితినాలోకించి
మఱియు స్పష్టవిచార మహిమఁదెలిసి
నిశ్చయింపఁబడియె నిష్ఠనారాయణు
సఫుణుఁ దలఁపవలయు నిరియొకండు."

అని యిట్లు పదేశించిన నానిష్ఠాగరిష్ఠుఁడు నారాయణ పదికమలస్మరణ ప్రభావంబున మేలిపదవికిఁజనియె నీవు నట్లే సకలవిషయములైన శాస్త్రార్థములయందు వాదంబులకుఁజొరక, నారాయణ పరాయణుండవై యతనిందలంపుము. దాననీకు సర్వశుభములగును. అద్దేవుండు భక్తసులభుండు. ఆశ్రితవాత్సల్యనిధియై వెలుంగును. అతనిం గొల్చునారికిఁ బడయరాని పదంబును, జెందరాని శుభంబును లేదు.

అనఘా! నీకనేక ధర్మములు సవిస్తరంబుగా నెఱింగించితిని. ధర్మములు బహుప్రకారంబులై యుండును. నీకు ధర్మసందేహము గల్గినపుడు శ్రుతమును, బరిత్యాగమునుగల మతిమంతుల నడిగి తెలుసుకొనుము. సాధుజనుల సేవసేయుము. సుఖదుఃఖములు గలిగినపుడు వానివశంబున మోదఖేదంబులం బొరయక చిత్తసమత్వము గలిగియుండుము. నీవు బుద్ధిమంతుఁడవు, ధర్మనిష్ఠితబుద్ధివి, నీకు వేఱచెప్పవలయునా? నీవింక రాజ్యమునకుఁబోయి, నీపూర్వులైన యయాతిప్రభృతులవలె

యజ్ఞయాగాదులొనరించి, సర్వజనసంతృప్తివెలయ రాజ్యపరి పాలనము సేయుము. సూర్యుఁడుత్తరాయణ గతినిబొందు సమయమెఱిఁగి మఱియు నాకడకురమ్ము"

అని యిట్లు భీష్ముఁడు వంపధర్మనందనుఁడు సంతోషించి తాత పాదములకు మ్రొక్కి వినయంబుతో వీడుకొని, సకల జన పరివృతుఁడై కరిపురంబునకుఁబోయి, యుచితవ్యాపారముల నుండెను.

(3) భీష్ముఁడు పరలోకగతుఁ డగుట.

రాజేంద్రా! అంతఁగొన్ని దినంబులేగిన సూర్యుఁడుత్తరాయణగతిని బొందుటయు, ధర్మనందనుఁడు ధృతరాష్ట్ర సోదర కృష్ణసాత్యకివిదుర యుయుత్సుసంజయ సకలకౌరవ స్త్రీ సమేతముగాఁ బ్రయాణమై, పితామహుని వీరశయనస్థానంబు సేరవచ్చి, ధ్యానగరిష్ఠుఁడై యున్న యమ్మహాత్మునకుఁ బ్రదక్షిణించి, దండప్రణామమాచరించి, తనతోవచ్చిన వారినెల్లఁ జూపిన, నమ్మందాకినీ తనయుఁడు తగిన విధంబుల ధృతరాష్ట్ర ధర్మజులతో సంభాషించి, శ్రీకృష్ణమూర్తిం జూచి

తే. "దేవదేవ! జీవాత్మక! దేవవంద్య!
శంఖచక్రగదా పద్మచారుహస్త!
వాసుదేవ! త్రివిక్రమ! వరద! పరమ
పురుష! ప్రణుతియొనర్చెదఁ గరుణఁ జూడు.

అని నమస్కరించి,

ఆ. బలము నీవనాకు భక్తుండ నీయెడ
నాలుబిడ్డలేని యట్టివాఁడఁ

గావుననన్ను నధికకారుణ్యమున, నిమ్మ
నుజ్ఞఁగమల దళమనోజ్ఞనయన."

అని శరీరవియోగము నొందుటకు ననుమతి వేఁడెను.

దయామయుండైన వాసుదేవుఁడాతని వదన మాలోకించి,

ఆ. "కీడొకండు లేదు కృతకృత్యుఁడవు, తండ్రి
వలనిభక్తి పెంపుగలవు దానఁ
గా వెబంటుఁ బోలె గాంగేయ మృత్యువు
నీవశమున నిల్చె నిర్భరముగ.

నీకనుజ్ఞ యిచ్చితి వసువులంబొందు" మనెను.

భీష్ముఁడంత యోగమార్గము గైకొని శరీరవాయువుల సన్నిరుద్ధంబు సేసిన, నవియూర్ధ్వగతిఁ గైకొనియె; శరీరావయములు క్రమంబునఁ బ్రాణరహితంబులయ్యె; నతని దేహాధిష్ఠితమైన యాత్మ సర్వాయతన సన్నిరుద్ధంబై మూర్ధంబు భేదించి, యుజ్జ్వలంబైన తేజంబుతో నాకసంబున కెగసి క్రొంతదవ్వరిగి యదృశ్యమయ్యెను. అప్పుడు ధర్మరాజాదులును, మునులును, బరమాశ్చర్యభరితులైరి. దేవతలు పుష్పవృష్టిగురిసిరి దేవ వాద్యములు మ్రోసెను. సిద్ధులుసాధ్యులు మొదలగు దేవత లెల్ల భీష్మునిం బొగడిరి.

అంత ధర్మనందనుఁడందఱతో భీష్మునకగ్నియిచ్చి. భాగీరధికిం జనితిలోదక ప్రదానంబాచరించెను. అప్పుడు నదీజలంబులోనుండి జాహ్నవీదేవి పుత్రశోకార్తయై వెలువడివచ్చి, కృష్ణ ధర్మజ ప్రభృతులంగని, పుత్రునిసుచరిత్రం బుగ్గడించి,

తే. "అంతవాఁడు శిఖండిచే నట్టులగుట
గనియుఁ జెక్కులు పఱియలు గాకయునికి
కతనఁ జేసి వజ్రమయంబుగాఁ గనోపు
ననితలంచెద నాడెందమన్నలార."

యని వగచిన, నద్దేవిని వాసుదేవవ్యాసమహర్షులు తగిన పల్కుల నూరార్చిరి.

తే. "నీవు శోకంబు దక్కుము, నీసుతుండు
పరమగతినొందె, శాపసంప్రాప్తిఁ జేసి
వసువుమర్త్యుఁడై వర్తించె, నసదృశప్ర
భావుఁడాతఁడు వగలవేల దేవినీకు."

గంగాదేవియు శోకముడిగి, కృష్ణధర్మనందన ప్రముఖుల దీవించి, నిజజలసాంగత్యము నొందెను. అంతధర్మపుత్రుఁడు సకలజనంబులతోను మునీశ్వరులతోను నది వెడలెను.

ఇది యనుశాసనికపర్వ కథాసంగ్రహము.



శ్రీ

శుభమస్తు

# బాలభారతము.

## XIV. అశ్వమేధపర్వము.



(1) వ్యాసుఁడు ధర్మరాజునకు ధనార్జనోపాయంబు దెల్పి యశ్వమేధము సేయునట్లు చెప్పుట.

వైశంపాయనుఁడు జనమేజయునకిట్లనియె. రాజేంద్రా వినుము, యుధిష్ఠిరుఁడట్లు భాగీరథీతటంబున మందాకినీ సూనునకుఁ బరలోకక్రియలు నిర్వర్తించి, యుమ్మలికంబు పెంపున, వాలమ్మునాఁకున నేలకు వ్రాలుమదపుటేనుంగు పోల్కి నుర్విపైఁ బడియె. ధృతరాష్ట్ర కృష్ణులుదగిన మాటలాడిరి. అందుఁ గృష్ణుఁడా రాజుతో నిట్లనియె.

చ. "అతులిత దక్షిణాన్వితమ
హాధ్వర కర్తవుగమ్ము దేవతా
పితృనివహంబులంగరము
ప్రీతియు భక్తియు నుల్లసిల్లన
ర్చితములు సేయు మున్విప్రజఁ
జేకొనిరక్షఘటింపు బంధుసు
స్థితులొనరింపు మొప్పునతి
థివ్రజపూజలొనర్పు భూవరా"

వేదవ్యాసమహాముని యింద్రుఁడానరపతికిట్లనియె. "అనఘ! నేనును, మతిమంతులైన నారదభీష్మాదులును జెప్పిన బుద్ధులెల్ల వఱదఁగలసిపోయెనా? ఏమిటికి దుఃఖించెదవు? మేలును గీడును దైవయోగంబుచే జనులకు సిద్ధించును. కర్త యీశ్వరుండేయని బుద్ధిలోనూని, వగపుదొఱఁగి, మనంబులోని పాపశంకవాయనధిక దక్షిణయుతంబుగా నశ్వమేధంబు సేయుము. అది భూపాలుర శుద్ధాత్ములంజేయఁ జాలునట్టి మహాయజ్ఞముసుమ్మీ. దుర్యోధనుఁడు సేసిన దుర్వ్యయంబుచేత నీబండారము శూన్యమై నీకు నిర్ధనత్వము వాటిల్లి యున్నదని విచారింపకుము. విశేష ధనలాభమునకు మూలమెఱింగించెద వినుము.

పూర్వము మనువంశమున జనించిన మహాకీర్తిపరుండైన కరంధముండను రాజుమనుమఁడు మరుత్తుండనువాఁడు, మహాతేజస్వి, వాసవతుల్యవైభవుండు, దేవగురుండైన యాంగిరసునకు సోదరుండగు సంవర్తుండను యోగివర్యునిఁ దనయజ్ఞమునకు ప్రద్రష్టగావరియించి, తదుపదేశంబున హిమవంతమున కుత్తరములోనున్న ముంజవంతమను పర్వతమునకుఁజని, శివునిభక్తితోఁ గొల్చి యమ్మహాదేవుకరుణవడసి, యందలి శుద్ధస్వర్ణమయములైన శిలావిశేషంబు లనేకంబులు త్రవ్వితెచ్చి, మహాధనవంతుఁడై, జన్నమునకు వలయు వస్తువిశేషంబు లెల్ల హేమమయంబులుగా నిర్మించి, మహిమవెలయ హిమవన్నగభూమిలో యాగముసేసెను. ఆమఖంబు సూడ శతమఖుండాదిగాఁగల దేవతలెల్ల వచ్చి తమతమ హవిర్భాగములు గొని సంప్రీతులై యారాజుంబొగడి చనిరి. ఆధరణీ విభుండంత భూను

రులకు విశేషధనములును, గాంచనమయంబులగు వస్తువులును దానముగానిచ్చెను. ఆవిప్రులు దమ చేనోపినంత ధనకనకరా సులు మోసికొని, తక్కినవానినెల్లఁ బ్రోవుగా నందేయొక్కచోట నిక్షేపించి, కాలాంతరమున నెవ్వరా పెన్నిధిని గాంతురో యది వారిదే యగుఁగాక యనిచెప్పి, తమతమ దేశంబులకుఁ జనిరి. కావున ధర్మపుత్రా! నీవాకాంచన సంచయంబు గొనివచ్చి, హయమేధంబుసేసి విచ్చలవిడిఁ బుడమి వేల్పులకు దానంబు లిచ్చి యాగంబు సుప్రయోగంబు గానెరవేర్పుము."

అని యిట్లు సంయమివర్యుఁడు హయమేధారంభమునకు వలయు ధనార్జనోపాయం బెఱింగింప, ధర్మరాజు సంప్రీతుఁడై మునిపతికి మ్రొక్కి వీడ్కొని, కృష్ణధృతరాష్ట్ర సోదర ప్రభృతి జనంబులతోఁ గరిపురికిఁ బ్రయాణమై, పుడమి జనులుగడు ముదంబునంబొదల రాజ్యపరిపాలన మొనరించు చుండెను.

—:(2) కృష్ణుఁడు ద్వారకకుఁబోయి మగిడివచ్చుట:—

రాజేంద్రా! కృష్ణార్జును లిరువురుఁ గొంతకాలమింద్ర ప్రస్థమునవసించి, యిష్టలీలలవిహరించుచు ననేకపుణ్య కథా శ్రవణపరులై కాలంబుగడపుచుండిరి. కృష్ణుఁడర్జునునకు నధ్యాత్మ విద్యా విషయంబులైన వాక్యములు పన్యసించి, యతనిం బ్రజ్ఞావంతునిగాఁ జేసెను. మఱియు వారు హస్తినాపురమునకు వచ్చి యెప్పటి యట్లనుండ, వాసుదేవుఁడు వసుదేవాదులం జూడఁగోరి, పాండవులచే నను జ్ఞాతుఁడై, సాత్యకి సుభద్రలందో డ్కొని ద్వారకకుఁ బయనమయ్యెను. అప్పుడు ధర్మనందనుఁడా యాదవ వర్యుని సకల బంధుమిత్ర భృత్యాసమేతముగాఁ దన యశ్వమేధయాగంబు సూడవచ్చునట్లు ప్రార్థించి వీడుకొల్పెను.

పద్మనాభుఁడు సంతోషించి కౌంతేయాగ్రజునకు వినీతుఁడై తేరెక్కి ద్వారకానగరంబు ద్రోవఁ గైకొని పోవుచు, మార్గమున భృగువంశజాతుండైన యుదంకుఁడను మునివర్యుని యాశ్రమంబుగని, యందుఁజొచ్చి యమ్మహర్షిచేఁ బూజితుఁడై యతనివలనఁ బొడమిన కారుణ్య విశేషముచే, నతని యహంకార మమకారాది చిత్త వికారంబులెల్లఁ దొలఁగు నట్లను గ్రహించి, తాను భారతయుద్ధారంభమప్పుడు పార్థునకుఁజూపిన తన విశ్వరూపంబామునివర్యునకుఁ జూపి, యతండు కోరిన వరములిచ్చి, యతనిచే నామంత్రితుఁడై నిజపురంబు సేరెను. యాదవ శ్రేష్ఠులెల్లఁ గృష్ణునిచే భారత రణప్రకారంబంతయు విని, సౌభద్రునిమరణంబునకుఁ దద్దయు దుఃఖించిరి. వాసుదేవుఁడు వారినెల్ల నూరార్చి సముచితప్రవర్తనల సకలబంధుజనములకును బ్రమోదమొనరించుచుండెను. అంతఁగొన్ని దినంబులేగిన వారిజాక్షుఁడు, ధర్మపుత్రుని చారులచే నతఁడశ్వమేధమునకుఁ బూనుటెఱిఁగి, బలదేవసాత్యకి ప్రద్యుమ్నాదులును, సుభద్రయుఁ దోడరా మఱియు హస్తిపురంబున కరుగుదెంచెను.

### (3) శ్రీకృష్ణుఁడు పీనుఁగై పుట్టిన పరీక్షితుని బ్రదికించుట.

అంతలో నిటవారణపురంబున ధర్మనందన ప్రముఖులు వ్యాసోపదిష్టమార్గమున హిమవంతముననున్న పసిడితండంబు తెచ్చుటకై, రాష్ట్రరక్షణార్థము యుయుత్సుని విదురునితో నిల్పి, యనేకబలములతోను, భారవాహకులతోను నప్పర్వతమునకుఁ బ్రయాణమై పోయియుండిన కారణంబున, ధృతరాష్ట్రుఁడును గాంధారియుఁ గొంతియుఁ గృష్ణునెదుర్కొని తెచ్చు

టకై యుయుత్సుం బంచిరి. వాఁడు విదురసహాయుఁడై యాద వ్యోత్తములనెల్లఁ దగినట్లు సంభావించి పురప్రవేశంబు సేయిం చెను. అందఱును బూజితులై తగుమందిరములలో సుఖంబుగా నుండిరి.

జనమేజయ భూపాలా! వినుము. వాసుదేవాది యాదవ ప్రవరులెల్లఁ గరిపురిలో సుఖంబుండ, నొకనాఁడభ్యంతర మంది రంబులోనున్న పుణ్యవతియైన యుత్తరాదేవి గర్భములోనుండి భవజ్జనకుఁడు పరిక్షితుఁడుదయించెను. లోపలియింటివారు పుట్టిన బాలుఁడు మృతజాతుఁడని తెల్ప, నంతఱు శోకవార్ధిలోమునిం గిరి. కుంతీ ద్రౌపదీ సుభద్రలు మున్నగు స్త్రీజనంబులెల్ల నా క్రందన ధ్వనులు నిగుడఁజేయుచుండఁ బరమపురుషుండైన వాసుదేవుం డందులకేతెంచి వారినూరార్చుచుండెను.

కుంతి కృష్ణునితో నిట్లనియె "మహాత్మా! నాసంత తికి నీవేగతివి. నీమేనల్లుని కొడుకుపీఁడె క్రూరుఁడగు గురు సుతుని బాణాగ్నిచే దగ్ధుఁడై యునుగులు గోలుపోయి పుట్టియున్నవాఁడు. నీవీకుఱ్ఱను సంజీవితునిగాఁ జేయకున్న, నాకు ను, బాండవులకును బ్రదుఁకబోలదు. నీదయకుఁ బాత్రులమగు మమ్ము రక్షింపవలయును"

ద్రౌపదియు సుభద్రయునట్లే దేవకీతనయుని వేఁడుకొని యిట్లనిరి.

చ. "భువనములొక్క పెట్టమృతి బొందిన జీవములావహింపనే
ర్తు వలచినట్టులైన, గుణరూపుఁడు మేనమఱంది పౌత్రుఁజా
వవిడుతె, వంతపెంపున నవారణనీ మొదురంబ్రలాపముల్
వివిధములే మొనర్చితిమి వెఱ్ఱులమైయిఁక భక్తవత్సలా"

రాజేంద్రా! కృష్ణుఁడప్పుడెల్ల వారువిన నీతండ్రిని బ్రదికించునట్లు చెప్పి, కుంతీప్రముఖులతో సూతికాగృహంబునకుఁ జనెను. అచ్చట నడలు పెల్లున నోడలెఱుంగక పడియున్న మాత్స్యనందనయు ద్రౌపదిచే మాధవుని రాకవిని, లేచి, విరిసిన వెండ్రుకలతో నయ్యాదిమ పూరుషునకు మ్రొక్కి, కన్నీరుడించుచుఁ దన బిడ్డకుఁ బ్రాణదానంబు సేయునట్లు ప్రార్థించి, యంత నిలువక, బాలశవంబు నెత్తి తొడలపైఁ బెట్టుకొని, తదాననం బాలోకించి

ఆ. "తాతలోకగురుఁడు దామోదరుఁడువచ్చి
యుండ లేచి మ్రొక్క వుజ్జ్వలాంగ,
ధర్మవేదియైన తండ్రికిఁ బుట్టియు
ధర్మపరుఁడవగుట తగు నెనీకు".

క. కనువిచ్చి గొంతిఁ జూడుము,
ననుఁ జూడుము ద్రుపదనృపతనయఁ జూడుము, నీ
జనకునితల్లి సుభద్రం
దనయా చూడు తలయెత్తి దరహాసముతోన్",

అని, బహుప్రకారంబుల పలవింపఁ జొచ్చెను.

ప్రణతార్తిహరుండగు కృష్ణుఁడప్పుడు విరాట రాజపుత్రింగని "యోడకోడకు"నుని యాశ్వాసించి, శుచియై యశ్వత్థామ బ్రహ్మశిరోనామ కాస్త్రంబు వారించి శిశువునకు నను వులొసంగిన, సెజ్జపైనున్న కుఱ్ఱమేనికిఁ బ్రాణములు వచ్చెను. అర్భకునియంగములు కదలెను. కనువిచ్చెను. అందఱు దానింగని యాశ్చర్య ప్రమోదమగ్న చిత్తవృత్తులై చక్రహస్తునిం బొగడుచుండిరి. ఉత్తరయుఁ గలంక దేఱి బాలుని నెత్తికొని,

మోమువిచ్చుచు, విష్వచ్చు చెలికాని ముందట మ్రొక్కి నిల్చెను. ఆతండును సంతోషించి శిశువునకు రత్నభూషణము లొసంగి, పరిక్షిత్తను పేరు దానికిడెను.

రాజేంద్రా! అట్లు హరిదయావలోకన లబ్ధజీవనుండై పెరుగుచున్న భవజ్జనకున కొక్కయేఁడు కాలము గడచిన నంతలో హిమవన్నగమునుండి పాండవులు వ్యాససహాయులై హేమరాసులుగొని మహా వైభవంబుతోఁ బురంబుసొచ్చి, పెద్దలకెల్ల మ్రొక్కి, బలదేవాది యాదవ వీరులనెల్ల గారవించి, విశేషించి పాండవ సంతానకారియైన హృషీకేశు ననేకభంగుల వినుతించి, సకల బంధుమిత్ర పరివార సమేతంబుగా సుఖంబను భవించుచుండిరి.

—:(4) అర్జునుం డశ్వము ననుగమించి రాజులనెల్ల జయించివచ్చుట.:—

రాజవరా! యుధిష్ఠిరుఁడు వ్యాస కృష్ణ ధృతరాష్ట్ర ప్రముఖులచే ననుజ్ఞాతుఁడై హయమేధంబునకు వలయు సంభారంబులు సమకూర్పను, భాండ స్రుక్స్రువాద్యు పకరణంబు లెల్లఁ గ్రొత్తలై స్వర్ణమయంబుగా నిర్మింపను దగిన పరిజనుల నియోగించి, యజ్ఞమునకుఁదగి శుభలక్షణములచే నొప్పుచున్న యశ్వరాజంబును రక్షించుకొనుచు, దానివెంట నరిగి సకల దేశంబులు జయించి వచ్చునట్లర్జునునకు నాజ్ఞయిచ్చి, శుభ ముహూర్తమునఁ దాను యాగదీక్ష వహించి, మునులనడు మఁదేజోరాశియై వెలింగెను.

పార్థుఁడనేక విప్రులతో గాండివ పాణియై జన్నపు గుఱ్ఱంబు వెనుకొని యుత్తరంబుగా నరిగి, త్రిగర్త ప్రాగ్జ్యోతిషపుర సింధుదేశంబు లాదిగా ననేకదేశంబులు సొచ్చి,

యందందుఁగల నానారాజ రాజసుతుల మదమడఁగించి, వారి నెల్ల భావిచైత్ర పౌర్ణిమా దివసంబున ధర్మపుత్రుని యశ్వమేధంబు సూడ హస్తిపురికి వచ్చునట్లొడంబఱిచి, దక్షిణ సముద్రతీరముననున్న మణిపూరు పురంబు సేరవచ్చెను. అన్నగరాధిపతి, చిత్రాంగద తనయుండు బభ్రువాహనుండనువాఁడు, తన తండ్రియగు నరుని రాకనువిని హర్షించి, యతనికి వినయముతో మ్రొక్కవచ్చెను. రాజధర్మమెడలి రణోత్సాహంబు దక్కివచ్చిన కొడుకును గుణహీనుఁడనియు, రణభీరుఁడనియు నర్జునుఁడు నిందించిపలికి, యించుకయేనియు నాదరింపకుండెను. దాని కక్కుమారుఁడు చింతాక్రాంతుఁడై మగిడి నిజపురంబునకుఁ జనుచుండెను.

రాజేంద్రా! వినుము. అప్పుడు నాగవనితయు నర్జునుని భార్యయునైన యులూపి యక్కుమారునొద్దకువచ్చి తన్నెఱింగించుకొని, తండ్రితో రణమొనర్చునట్లు వానిని బ్రోత్సహించెను. సర్వశస్త్రాస్త్రవిద్యాకోవిదుండగు బభ్రువాహనుఁడు వీరోల్లాసంబు సంధిల్ల నలంకరించుకొని, హంసకేతు స్థితమగు దివ్యరథమెక్కి, మఖతురగంబున కడ్డముగావచ్చిన, విజయుఁడు మెచ్చి కొడుకుతోఁ బోరొనర్చెను. అప్పటి యుద్ధములో తండ్రియుఁ గొడుకును బరస్పర దివ్యాస్త్రములచే నేలవ్రాలిరి. అంతయువిని చిత్రాంగద యులూపితో రణప్రదేశంబునకు వచ్చి, పుత్రభర్తృ మరణంబులకుఁ దద్దయు వగచుచు, నాథుని సజీవునిగాఁ జేయునట్లు నాగవనితం బ్రార్థించుచుండెను. అంతలో బభ్రువాహనుఁడు మేల్కాంచి తల్లితోఁ దానును వగచుచు

జనకవధ మహా పాపంబునకుం బరిహారంబుగాఁ బ్రాయోపవే శంబున శరీరవియోగ మొంద నిశ్చయించెను.

ఉలూపి యప్పుడడ్డము వచ్చి "వెల్లులారా! అర్జునుండు సచ్చునా ? అతండు నారాయణ సఖుండగు నరుండగుట యెఱుంగరా? నేను మోహనంబగు మదీయ మాయాప్రయోగంబున నిట్లాతనిఁ జేసితిని, దీనికిఁ గారణంబు పదంపడి సెప్పెద" నని, సంజీవనమణిఁ దెప్పించి, తత్ప్రయోగంబున నర్జునుని బ్రదికించెను. అతండును నిద్రలోనుండి లేచువాని పగిది లేచి కూర్చుండి, కలయంగనుం గొని "ఇదియేమి? ఏలయిటకుఁ జిత్రాంగదయు, నులూపియువచ్చినవా"రని కొడుకునడుగ, నతండు వినీతుండై సర్వంబు నులూపిచే నెఱుంగునట్లు చెప్పెను.

నాగవనిత యప్పుడు నాథునకు నమస్కరించి వసువుల కోపప్రసాదంబుల తెఱంగతనికి నెఱిగించునదియై యిట్లనియె. "అనఘా! నీతనయుఁడగు బభ్రువాహనునిచే భంగపడినదానికి వగపకుండుము. అతఁడు గుణవంతుఁడు. వానియందొక్క కీడునులేదు. ఇది యంతయు నేనే సంఘటించిన దానను. నీవు శిఖండిని మున్నిడుకొని వీరోత్తముండైన పితామహునింజంపిన దానికి, వసువులు కోపించి నీకు శాపమీయనున్న, నేనదితోడి సఖులచే నెఱిఁగి, నాతండ్రికిం జెప్పితిని. అతండు రయంబును భయంబును మెఱయ, వసువులపాలికిఁ బఱతెంచి, వినయంబుతో మొక్కి. నీపై విరోధబుద్ధి వదలునట్లు వారిని వేఁడుకొనెను వారందులకుఁ గరుణించి, పార్థుఁడు నిజతనూజుఁడగు బభ్రువాహనునిచే రణంబులో నిహతుఁడగునేని, నతఁడు పాపవిముక్తుఁడగునని చెప్పిరి. నాతండ్రిచే నంతయు విని, నేఁడిట్లు నీకు భీష్మ

వధజాత పాపనిష్కృతియగునట్లు నీకొడుకు చేఁబడునట్లు చేసి తిని. ఇంక నీకుఁ బాపశంకవలవదు. సుఖంబుగా నుండుము."

అర్జునుఁడు దేవరహస్య వేదియైన భార్యపల్కులు విని సంతోషించి, సాదరంబుగాఁ బుత్రునవలోకించి, యాతనిం దల్లులతో నశ్వమేధంబు సూడవచ్చునట్లు నియమించి మేధ్యాశ్వంబు వెనుకొని, చేదిమాగధ కళింగ ద్రవిళ కేరళ కర్ణాటాంధ్ర దేశంబులాదిగాఁగల బహు జనపదంబులు సొచ్చుచు, నందందుఁగల ధరణిపాల సుతులఁ గారుణ్యంబు పెంపునఁ జంపనొల్లక, నయంబును భయంబును జూపి తనకు వశ్యులుగా నొనర్చి, వారికి ధర్మరాజు నానతియొతింగించి, యవారణలీల వారణపురంబు దిక్కై చనుచుండెను.

అంతలో నిట ధర్మరాజు యజ్ఞారంభోచిత సకలక్రియా కలాపంబులయందు ప్రమత్తుండై మెలగుచు, ననేక బ్రాహ్మణ సంతర్పణలు సేయుచుండి, తమ్ముఁడు దిగ్విజయంబు సేసివచ్చుటను విని సంతోషించి. యతనిందగిన విధంబునంబుర ప్రవేశంబుసేయించి గారవించెను.

—: (5) ధర్మరాజశ్వమేధయాగము నిర్విఘ్నముగా నెరవేర్చుట. :—

కారవేశ్వరా! జన్మము దొడఁగుటకుఁ దక్షిమైన సాత్వవశేయుండు గాం తేయాగ్రజునొదకువచ్చి. యాగమున కుపక్రమించునట్లును, త్రిగుణీకృతదానంబుల మూఁడుమఖములఫల మొందునట్లును జెప్ప, నాపృథ్వీపతి తిలకుఁడు మంత్రదక్షులైన యాజ్ఞికులసహాయ్యంబున విధ్యుక్తప్రకారంబుగా సర్వక్రియా

కలాపంబుల స్ఖలితంబుగా నడపి, మేధ్యంబగు తురంగంబునంగం
బులమాసంబులయ్యె దేవతలకాహుతులిచ్చి, యశ్వవపాహో
మంబుచేఁ బరగుధూమగంధంబనుజ సహితంబుగా నాఘ్రాణిం
చి పరమానంద భరితుఁడయ్యెను. వ్యాసాది మునీంద్రులును,
నిత్యకర్మానుష్ఠాన నిరతులైన ధరణీదివిజులును,ధర్మరాజు నాశీర్వ
దించి కొనియాడిరి. అతఁడు మునిసంఘంబులకు మ్రొక్కి వారి
కపారధనంబులొసంగి, ఋత్విగ్వరుండైన పారాశర్యునకు విజ
యునిచే విజితమైన పృథ్వియంతయు దక్షిణగానిచ్చి, వనం
బులో మునివృత్తినుండఁ దనకాజ్ఞాపన మొనరించునట్లాసంయ
మిసర్యుని వేఁడెను.

వ్యాసుఁడుదాని గొడంబడక మునులయనుమతంబునఁ
బుడమికి మాఱుగా నారాజవర్యునిచేఁ బసిడితండంబులు గొని,
వానినెల్ల ఋత్విగ్జనులకుఁ బంచిపెట్టెను. ధర్మపుత్రుఁడు మఱి
యుఁ గాంచనమయంబులైన వేదికాయూపతోరణ భాండదండ
శయ్యాసన ప్రముఖసకల సామగ్రులవనీసురుల కొసంగి పృథ్వి
లోని సకలరాజ వైశ్య శూద్ర జాతులకును, నీచకులీనులకు
ను బ్రభూత ధనంబులిచ్చి, యవభృథస్నాన మాచరించి గత
కల్మషుఁడై వెలింగెను. రాజులెల్లఁ బూజితులై తమతమ
దేశంబులకరిగిరి. మునీంద్రులును శిష్యులతో నంతర్ధాన మొన
రించిరి. కృష్ణుండును బలదేవప్రముఖనిఖిలయాదవ వీరులతో
నిజపురంబు సేరెను. ధర్మతనయుని యశ్వమేధము, పేరుగల
తొల్లింటి పదార్వురవనీపతులయాగంబులట్లు సమగ్రదక్షిణ
లచేనొప్పి, సుప్రయోగంబై సకల జనానందకరంబుగాఁ
జెల్లెను.

## (6) యాగసమయమున నకులంబు బ్రాహ్మణులకు సక్తుప్రస్థునిచరితంబు సెప్పుట.

రాజోత్తమా! అశ్వమేధమప్పుడు పుట్టినవి శేషం బొక్కటివినుము. తొల్లిజమదగ్ని మహామునిపితృశ్రాద్ధంబు సేయసంకల్పించియుండ, నతనికిఁ గోపంబుగలుగఁ జేయనెంచి క్రోధాధిదైవము దానికి విఘ్నమాపాదించెనుగాని, యమ్మునివర్యుఁడు కుపితుఁడుగాక శాంతభావంబుతోనుండెను ఆతని పితృదేవత లప్పుడాతనికిఁ బొడసూపి "నీవు శ్రాద్ధకర్మమునకు విఘ్నము సేసినవానిపైఁగినియవు. ముంగిసవై పుట్టు" మని శాపమిచ్చిరి. జమదగ్ని పితరులతోఁ దపస్వులకుఁ గ్రోధంబు దగదని యెఱింగించి, తనకు శాపమోక్షప్రకార మనుగ్రహించుమనట్లు వేఁడెను వారాతనితో "నీవెన్నఁడు విద్యావంతులైన విప్రులసన్నిధి మహాధర్మమైన కార్యమును గీడుగాఁబల్కఁగలవో యప్పుడు నీకు శాపము దొలఁగు" నని చెప్పి వెడలి పోయిరి.

ఆ ముంగిస సమయంబు వేచియుండి పాండవాగ్రజుని యశ్వమేధ సమయమున బిలంబువెడలి యాగశాలలోనున్న విప్రుల నవలోకించి "ఎంతమహిమతోఁ జెల్లినను ధర్మతనయుని యశ్వమేధము సక్తుప్రస్థుని ధర్మమునకు సరిరా" దని పల్కెను. అప్పుడందఱు నాశ్చర్యముతో నకులంబుంగని "నకులమా! నీకిట్లాడఁదగునా? ఇమ్మహాధ్వరంబులో నీవేమి తక్కువ కంటివి? మంత్రతంత్ర విధానంబులలో నేలోపం బొడవదు. అక్షీణ దక్షిణలచే నందఱు బ్రీతులైరి. అందఱకు నీయాగ ధర్మము స్తోత్రార్హమైయుండ, నీచే గర్హితంబగుటకుఁ గారణ మేమి?" యని యడిగిరి.

ముంగి యిట్లనియె. "వినుఁడీ విప్రవర్యులారా! పుణ్య
భూమియగు కురుక్షేత్రములోఁ దొల్లి, రోషకామాది దూరుఁ
డును, సువ్రతుఁడునైన సద్విజుం డొక్కఁడు, భార్యాపుత్రస్నుషా
సహితముగా నుంఛవృత్తిమై జీవించుచుండెను. అతని పేద
ఱికమునకుఁ దోడుగా వానలేమి దోసంబు నొదవుటచే, నక్కు
టుంబము వారత్యంత ప్రయాసంబున నిత్యముగింజ లేరి తెచ్చి,
దానిని గుంచెఁడు సక్తువుగా నొనర్చి యందఱు సమముగా
నుపయోగించుచుండిరి. ప్రస్థమాత్రపు సక్తువుచేఁ గుటుంబ
భారము నిర్వర్తించుచుండిన యా గృహస్థునకు సక్తు ప్రస్థుఁ
డను నామంబు గలిగెను.

ఒకనాఁ డతఁడు నిత్యకర్మానుష్ఠానములుదీర్చి యందఱకు
నాఁటి సక్తువు పంచియిచ్చి తనపాలు భుజించువాఁడై యున్న
యవసరంబున, నతనియింటికతిథియై యొక విప్రుఁడువచ్చెను.
ఆగృహస్థుఁ డతిథికినలయు పూజలిచ్చి, యతని కాహారముగా
నిజాంశమగు పిండినిచ్చెను. దానిచే నతని యాఁకలి వోవకుం
డుటను జూచి గృహస్థుఁడు విచారగ్రస్థుఁడై యుండ, నతని
యిల్లాలు భర్తం జేరవచ్చి "నాథా! నీవాఁకలితో నుండ నాకు
సక్తువేటికి? నాపాలునతిథికిచ్చి యతనికిం బ్రియంబుగావింపుము.

తే. పతియుచుట్టంబుఁ బక్కంబు బతియ చెలియుఁ
బతియ తల్లియుఁ దండ్రియుఁ బతియ గురువుఁ
బతియదైవంబుఁ గావున నతనిపనియొ
నర్చుటయచూవె ధర్మంబు నాతికరయ."

యని, తనయంశమగు సక్తువును ముందుగాఁబెట్టెను.

గృహస్థుని యనుమతి మీఁదనదియు నాయతిథి భుజిం
చెనుగాని, యప్పటికి నతని దప్పితీఱకుండెను. కొడుకప్పుడు

తండ్రికి మ్రొక్కి తనపాలుసక్తువా యతిథి కిచ్చునట్లుచేసెనుగాని, దాని నుపయోగించియు పాఋనకాఁకలి తీఱదయ్యెను. అంతఁ గోడలును మామకుముందుగాఁ తనపాలిసక్తువునుంచి దానిచే నతిథికి నాహారతృప్తిగావించునట్లు ప్రార్థించెను. ఇంటియొడయఁ డట్లే యప్పడతికిం బ్రియంబుగా దానిపాలిటి పిండియు నాయ తిథికిచ్చెను. ఆవిప్రుఁడు దానినింపెసలారభుజించి తృప్తివ హించి, మామలరసక్తు ప్రస్థునింగని యిట్లనియె.

"అనఘా! నేను ధర్మదేవతను. నీసద్వ్రతంబునకు సంతో షించి, నిన్నుఁజూచు వేడ్కతోనిందు వచ్చితిని. నీవు మహాను భావుఁడవు. సుశీలుండవు. నీవంటిపుణ్యులెందును లేరు. నీభక్తియు శ్రద్ధయు, వినయంబును, దాల్మియు, నతిథిప్రియత్వమును గొని యాడఁదగినవి. జనులకాఁకలి పిశాచమువంటిది. ఆఁకలితో నుండు వారికిఁ బ్రజ్ఞయెడలును. కర్తవ్యాకర్తవ్యంబులు దోఁప కుండును. కృపవీడిపోవును. కోపమతిశయిల్లును. నీవు జితేంద్రి యుఁడవు గావున, నాలుబిడ్డలనక వారిపాలిచ్చియు నాకుఁ బ్రియంబు సల్పితివి. నీచేసిన ధర్మమునకు దేవతలును విస్మయ మందియున్నారు. నీపుణ్యమునకు ఫలముగా నిదిగోవచ్చియున్న దివ్యవిమానమెక్కి, దారాతనూజస్నుషా సహితంబుగా బ్రహ్మ లోకంబునకుఁబొమ్ము."

"విప్రవరులారా! వినుఁడు, ధర్మదేవత యట్లుసక్తు ప్రస్థుని ధర్మముగొనియాడి, సబాంధవముగా నాతని దివ్యరథం బుపై నెక్కించి బ్రహ్మలోకమునకుఁ బ్రియంబుతో ననిచి పుచ్చి, తానునంతర్థాన మొందెను. నేను దానినంతయుఁ గని బిలంబునుండి వెలుపలికి వచ్చితిని. అప్పుడు సక్తువు గంధము

చేతను, నతిథికిచ్చిన పాద్యజల సంస్పర్శనముచేతను నాతలయు నొకప్రక్క యొడలును బంగారుమయము లయ్యెను. నాఁటి మొదలు నా దేహములో రెండవ ప్రక్కయుఁబసిఁడి యగునను నాసచే ననేకపుణ్య ప్రదేశములకును,యాగస్థానములకునుబోయి చూచితిని. నాకోర్కె సిద్ధింప లేదు. మహాపుణ్యానిధియగు ధర్మాత్మ యుని యశ్వమేధంబున నాతలంపొడఁ గూడునని యెక్కుడా సతో వచ్చితిని. ఇందేమియు విశేషంబు నాకుఁగాన రాదయ్యె. అందుచే నాయుంఛ వృత్తివిప్రుని ధర్మమునకు 'నీ యాగంబు దక్కువయని నిరూపించితిని''

శౌరవ్యోత్తమా! వినుమట్లానకులంబు ధరణీసురులతోఁ బల్కి శాపమోక్ష సౌఖ్యంబనుభవించి యదృశ్యమయ్యెను. ఇది యమ్మేటి యధ్వరంబులోఁ గలిగిన విశేషంబు. నకులంబు దానిం దక్కువచేసి పల్కుటకుఁ గారణము, హింసారూపమైన యజ్ఞ ముకంటె, నహింసాత్మకమైన తపోమయ యజ్ఞంబు శ్రేష్ఠమని తెల్పుటకుఁగాని వేఱుకాదు. అదియునుంగాక,

ఆ. ''ఉంఛవృత్తియైన యుర్వీసురోత్తముం
డట్లు ప్రాణరక్షకై ఘటించి
స్వజనములును దాను భుజియింపనుండి యా
సక్తువతిథికిచ్చెఁ జనదె పొగడ?''

ఇది యాశ్వమేధపర్వకథా సంగ్రహము.



శ్రీ

శుభమస్తు.

# బాలభారతము.

## XV. ఆశ్రమవాస పర్వము



### (1) ధృతరాష్ట్రుఁడు గాంధారీ కుంతీదేవులతో వనంబునకుఁ బోవుట.

వైశంపాయనుఁడు జనమేజయున కిట్లనియె.

"ధర్మనందనుఁ డట్లు యాగాది బహువిధధర్మ కర్మనిరతుఁడై సోదరులతో రాజ్యసుఖంబులను భవించుచు, ధృతరాష్ట్రవిదుర సంజయయుయుత్సులకును, గాంధారీకుంతీ ప్రముఖ సకల కురుస్త్రీలకును సంతోషంబాపాదించునట్టి ప్రవర్తనలం దగిలి, విశేషించి వృద్ధులగు గాంధారీ ధృతరాష్ట్రులకు భక్తియు, వినయంబును, శ్రద్ధయు, వెరవును మెఱయఁబరిచర్యలు సేయుచు, వారికిఁబుత్రులు లేమి శోకంబుదోఁపనీయక సముచిత శుశ్రూషలఁ బ్రహృష్టహృదయులుగాఁ జేయుచుండఁ బదియేను సంవత్సరములు గడచెను.

అంత నొక్కనాఁడాయంధనృపతి సకలబాంధవ సమక్షమున ధర్మరాజుతో నిట్లనియె. "అనఘా! నాదగులోభగుణంబుచేఁ గౌరవులెల్లఁ జెగిరి. ప్రాజ్ఞులగు విదుర భీష్మ ద్రోణుల

పల్కులు పాటిగాఁబట్టక, పుత్రమోహంబున దుర్యోధను దెసకు ప్రాలి కులనాశము గావించితిని. అయినను గొడుకులు క్షాత్ర ధర్మ నిరతులై సమరములో నడుగులు దిరుగక మృతులై సద్గ తికిం జనిన దానికి సంతోషించితిని. నీవాచరించు సేవలచేత నేకొఱతయు లేక ధృతిగల్గి తేజంబుతో వర్తించితిని. నాకుముది మి యతిశయిల్లుటచే,నింకవనంబున కేగి గాంధారితోనందు వసిం చి, తపోనిరతినుండి శరీరపరిత్యాగము సేయుటనా కుచితమగు ను. రాజులకు యుద్ధములోఁ జచ్చుటొండె, నడవిలో మునివృత్తి నుండి చచ్చుటొండెఁ బోలుఁగాక, యింటిలోఁ దెవ్వులుగొని మృతినొందుట నీచమైనది. కావున నీవొండనక నన్నడవికనిచి పుచ్చుము."

ధర్మరాజు కడువగచి పెద్దతండ్రి యడుగులకెరగి డగ్గు త్తికతో "నరోత్తమా ! నీవేమాకెల్ల రాజవు. నేనొకరాజనే? నాకు రాజ్యముపై నించుకయేనిఁ బ్రీతికలుగదు. నీవెంట నేను నడవికివచ్చి నీకుఁబనులు సేయుచుండెద" ననియె.

ఉ. తల్లియుఁదండ్రియున్ గురుఁడు దైవమునాకరయంగనీవ,భూ
వల్లభ నీవు కానన నివాసముగోరెచనంగ నెట్టులే
నుల్లమువట్టిహస్తిపురి నుండఁగనేర్తు? యుయుత్సుఁబెంపుతో
భిల్లఁగరాజుఁజేయు,నినుఁ బ్రీతియెలర్పఁగఁగొల్చివచ్చెదన్.

ధృతరాష్ట్రుఁడతని ననునయించుచుండనంతలో వ్యాస మహర్షి యేతెంచి,

క. కేవలతపఃక్రియాసం
సేవనతాత్పర్యమిపుడు చిత్తంబునయుం

దావేశించినయది యీ
భూవరునకు నితనిననిచి, పుచ్చుమడవికిన్.

అని ధర్మరాజు నుద్దేశించి పలికి నిజాశ్రమంబున కేగెను. ధృతరాష్ట్రుండును పౌరులయనుమతంబువడసి వారలకు ధర్మనందనాదుల నొప్పగించి వల్కలాజినములు ధరించి గాంధారితో నిల్లువెడలెను. అతని వెంటఁగుంతియుఁ బాండవులును, కౌరవకాంతానిచయంబును, పౌరులును నడచుచుండిరి. అంతనామహీపతి పురమునిర్గమించి తనతోవచ్చువారి నిలువఁబంచెను. విదురసంజయులు రాజుతో వనంబులో వసింప నిశ్చయించుకొనిరి.కుంతీదేవి బావకు నప్పరుఁ బరిచర్యలుసేయునెంచి వారివెంటఁ దగిలెను. పాండవులు తల్లి మనోనిశ్చయంబు మాన్పలేక ఖిన్నులై పెద్దతండ్రికిని దల్లులకును మ్రొక్కి వీడ్కొని తక్కినవారితోఁ బురంబునకుఁ బోక్కుచు మరలిరి.

ధృతరాష్ట్రుఁడు గాంధారీ కుంతీ విదుర సంజయులతో గంగానది దాఁటి, కురుక్షేత్రంబుసొచ్చి, శతయూపుఁడను రాజర్షి నివ్సిన యాశ్రమంబులోఁ దగిన పర్ణశాల యమర్చుకొని, యందు నియతాహారుఁడై తపంబు సల్పుచు, నిజశరీరంబుఁ గృశింపఁజేయుచుండెను. నారదప్రముఖ దివ్యమునీంద్రులాతనిఁ జూడవచ్చి పుణ్యలోక వాస సౌఖ్యమతనికచిరకాలములోఁ గల్గునని చెప్పి వెడలిపోయిరి.

(2) పాండవులు బంధువులతో ధృతరాష్ట్రు నొద్ద నెలనాళ్లు వసించుట.

రాజేంద్రా! ఇటహాస్తిపురిలోనుండు పాండవులు రాజ్యభోగములయందెక్కుడు ప్రీతిలేక, యనుదినంబును వనములో

వసించు ధృతరాష్ట్ర ప్రముఖులందఱుచుచు విషాదభరితచిత్తులై, యొక్కనాఁడు వారలనెల్ల దర్శించు వేడ్కజనింప, సకల బంధువులతోను, స్త్రీలతోను, సైన్యములతోను, వాద్యనినాదంబులు సెలంగుచుండ నతివైభవంబు మెఱయఁ బ్రయాణంబు సేసిరి. అంతఁ ఋ భాగీరథియు త్తరించి కురుక్షేత్రంబు సేరి శతయూపాశ్రమముసొచ్చి, యమునలో స్నానమాచరించి గాంధారి కుంతులతో వచుచ్చున్న వృద్ధరాజాంగని వినతులై మ్రొక్కిరి. అతండును సపరివారముగా నిజాశ్రమములో వసించి, యనేక మునిజనముల గోష్ఠినుండి వివిధ ధర్మమయ సంభాషణలు సల్పుచుండెను.

మహాజ్ఞానియు, మాండవ్యుని శాపకారణమున భువిశూద్రయోనిలోఁ బుట్టిన జముండనునైన విదురుఁ డాశ్చర్యకరమగు తపస్సుసల్పి, నిజయోగబలంబున నెందేనియుఁ దిరుగుచు మఱలివచ్చుచు, నొక్కనాఁడు ధర్మదేవతా తనూభవుండైన యుధిష్ఠురుని శరీరములోఁ దన తేజంబావేశింపఁజేసి సిద్ధిఁబొందెను. అందఱునతని చరిత్రమున కద్భుతమందిరి. పాండుపుత్రులు ధృతరాష్ట్రునిం బరివేష్టించియుండి, యతని యాశ్రమములో నెలనాళ్లువసించి, మునులవలనఁ బుణ్యకథలు వినుచుండిరి.

## (3) వ్యాసమునీంద్రుఁడు ధృతరాష్ట్రాదులకు భారత రణ నిహతులైన బంధువులం జూపుట.

రాజేంద్రా! వినుము. పాండవులట్లు సపరివార సాంతఃపురంబుగా నడవిలోఁ దమయయ్యనొద్దనుండ, నొక్కనాఁడు వ్యాసుఁడందులకేతెంచి యందఱిచే సత్కృతుఁడై, కొడుకునుం గోడండ్రనుజూచి కుశల ప్రశ్నంబు సేసిన, వారును ముదమంది

భారతాజి మృతబంధుకోటిని దర్శింపఁగోరి, యయ్యుత్తమ తపోనిధికిం దమ యభీష్ట మెఱింగించిరి.

కృపాధుర్యుఁడైన పారాశర్యుఁడు వారికి భారతరణంబు పొంటె దేవదానవాంశముల భువిలో మనుష్యులై పుట్టిన వీరుల నెల్ల నెఱింగించి, యమ్మేటి పోరిలో నీల్గిన యాజోదుల నెల్లఁ జూపుటకై యందఱతో గంగాతీరంబునకుఁ జని, నదీస్నానమాచరించి చచ్చిన చుట్టముల నుద్దేశించి "ఇందురండు" అని గంభీరమగు నెలుంగుతోఁ బిల్చెను. రాజోత్తమా! నీకేమని చెప్పుదును? అప్పుడు దుర్యోధన దుశ్శాసనాది ధార్తరాష్ట్రులును సౌభద్రుండును, ప్రతివింద్యాదులైన కురుకుమారులును, బాహ్లీక కర్ణశల్య ద్రుపద విరాట గాంధారపతులును, వారి వారి చుట్టములైన రాజులును, భీష్మ ద్రోణులం బురస్కరించుకొని నీటిలోనుండి రవమెసఁగ వెలువడి, తమ పూర్వవైరమెల్ల మఱచి, యతిప్రియంబున నందుఁ దీరములోనున్న ధృతరాష్ట్రాదులతో నిష్టలీలల విహరించి యొక్క దినమెల్ల వారితో సుఖముగానుండి, మునిపతి యనుమతిసేయ మఱునాఁడు దివికిం జనిరి. అంత విధవలగు కురుకాంతలు మునిపంపున గంగనీటిలో మునిఁగి తనువులు విడిచి తమ భర్తలం గూడుకొనిరి.

వ్యాసమహర్షియంత మృతబంధు దర్శనామోదియైన ధృతరాష్ట్రు నవలోకించి పాండవులకు వీడుకోలిచ్చి యతనిని నిజాశ్రమమునకుఁ బోవఁబంచి, తాను నంతర్ధానము సేసెను. అందఱు మునిశక్తికిఁ జోద్యమందుంచు నిజావాసంబులకుఁ జనిరి.

—(4) ధృతరాష్ట్ర గాంధారీకుంతులు పరలోకగతులగుట. :—

ధృతరాష్ట్ర భూవిభుఁడు తనకు గాంధారి కుంతులును, సంజయుండును బనులుసేయ భవ్యమగు తపస్సు సల్పుచు వనంబులో మూఁడేండ్లుండి, యొక్కనాఁడు గంగాద్వారమునకుం జని యందొక్క మహారణ్యములోనుండ, నప్పుడు కార్చిచ్చు ముట్టి యా వనమంతయు నేర్చుచుండెను. నిరాహారులై తపో నిరతినున్న ధృతరాష్ట్రుఁడును గాంధారియుఁ గుంతియు నందుఁ గదలనేరక, యొక్కెడఁ దూర్పుముఖంబుగా నాసీనులై యుండిరి. ఆమ్మహారాజు శాసనంబు చొప్పున సంజయుఁడు మాత్రము మెలకువతో నయ్యడవి దాఁటి హిమాచల మెక్కి చనియెను. ధృతరాష్ట్రుఁడు యోగబలముచేఁ దనువువిడిచెను. గాంధారియు, గొంతియు దవానల శిఖలచేఁ గ్రాఁగిరి.

యుధిష్ఠిరుఁడట నారద మునీంద్రునిచే నమ్మువ్వుర నిర్యాణంబువిని, సంతాపితాంతః కరణుండగుచు నిట్లు ప్రలాపించెను.

సీ. ఎఱుఁగంగవచ్చునే యెవ్వరికెత్తఱి,
నేదెసయగునో మునీంద్రయేము
గలుగంగ దెసలేని పులుమానిసికిఁబోలె
నక్కురువృద్ధునకట్టిచావు
పాటిల్లెసముదీర్ణబాహు దర్పోజ్జ్వలు,
లైనపుత్రులునూర్వురిట్లుకలిగి
బలమునాగాయుత ప్రాణసమంబగు,
నమ్మహారాజట్టియడవిచిచ్చు
తే. వలనఁ దెగటాఱె నేమనఁ గలదు కమల
ముఖుల తాలవృంతానిలముల సుఖించు

ప్రభువుకంకగృధ్రావలీ పక్షివాయు,
వడరనిలఁబడియున్న వాఁడక్కటకట.

క. వినుఖాండవదహనంబునఁ
దనకుఁ బ్రమోదంబు శక్ర తనయుఁడొనఁగె, నా
తనితల్లిఁగాల్పఁదగు నే
యన లునకుం, గడుఁగృతఘ్నుఁ డయ్యెమునీంద్రా.

నారదుండా భూపాలవర్యు నుచిత వచనంబులనూరార్చి, తండ్రికిందల్లులకు నుదక క్రియలు నిర్వర్తింపఁ బంచిన,నతండను జాంతః పురస్త్రీ జనసహితుఁడై జాహ్నవి కేగిధృతరాష్ట్రునకు, గాంధారికింగొంతికినిదిలోదక ప్రదానంబాచరించి, బహుళదక్షి ణాన్వితముగానందఱకు వేర్వేఱ శ్రాద్ధక్రియలునడపెను.

ఆ. మునిజనములువచ్చి యనుమోదమందంగ
సకలబంధుజనులు సంతసిల్ల
నన్న పర్వతముల నాజ్యనదులఁబెత్తృ
మేధముల్లసిల్లె మేదినీశ.

నారదాదిమునీంద్రులంత నారాజకుంజరు నామంత్రణంబు సేసిచనిరి. అతండును గుంజరపురంబునకునచ్చి యెప్పటియట్ల యెల్లజనులు మెచ్చునట్లు పుడమియేలుచుండెను.

ఇదియాశ్రమవాస పర్వకథాసంగ్రహము.



శ్రీ

శుభమస్తు

# బాలభారతము.

## XVI. మౌసలపర్వము.

### (1) యాదవులెల్ల సముద్రతీరమున నొండొరులతోఁ బోరాడిచచ్చుట.

వైశంపాయనుఁడు జనమేజయున కిట్లనియె. "రాజేంద్రా! ధర్మరాజుపట్టాభిషిక్తుఁడైన సంవత్సరమునకు ముప్పదియాఱవ యేఁట నతనిరాజ్యములోను, యాదవేంద్రుని నగరిలోను లోకభయంకరములైన మహోత్పాతములుబుట్టెను. యాదవులెల్లరోఁకలిచే నొండొరులఁ బొడుచుకొని మడిసిరి. అవ్విధంబంతయువినుము. ఒకప్పుడు కణ్వనారద విశ్వామిత్రులు కృష్ణుని జూచువేడ్కతో ద్వారవతికివచ్చినఁ గాలగోచరులైన యదువృష్ణికుమారు లవినీతిపరులై సాంబున కంగనావేషము ధరింపఁజేసి మునివర్యులతో "మహాత్ములారా! ఈసడతి బభ్రునిభార్య, దీనికిఁ బుత్రుఁడుదయించునా ?" యని యుపహాసపువాక్యముఁనడిగిరి. దానికి వారుకుపితులై

క. అంబుజనాభునికొడుకీ
 సాంబుఁడుగను యాదవక్షయాపాదనక
 ల్యంబగుముసలముమావచ
 నంబునకనృతంబులేదు నమ్ముఁడుమీరల్"

అనిశాపమిచ్చి నారాయణుని దర్శింపకయే పోయిరి.

వసుదేవాది యాదవులెల్ల భయమందియుండిరి. కృష్ణుఁడు కాలమహిమ యెఱిఁగి యూరకుండెను. మఱునాఁడు సాంబుని కడుపులోనుండి జముదూతయో యనను బెట్టిదపురోఁకలియొకటి వెలువడెను. దానినియాదవులు పొడిసేసి సముద్రములో వైచినను ముని ప్రభావంబున ముసలశక్తి చెడక యచ్చట పెరిగియుండినతుంగలయందుఁ జొచ్చియుండెను.

పురములో నిత్యము యాదవులచేటు దెల్పునట్టి యశుభచిహ్నములు గన్పట్టుచుండ, వాసుదేవుఁడు యాదవులనెల్ల సుందరీజనసహితముగా సముద్రతీరమునకుఁ గొనిపోయి యందువారినెల్లఁ దగినపటకుటీరంబుల వసియింపఁజేసెను. బలదేవుఁడు మాత్రము వారితోనుండక చేరువనున్న వనములో నొకవృక్షమూలంబునఁ దపస్సునల్పుచుండెను. సాత్యకికృతవర్మ ప్రద్యుమ్నానిరుద్ధసాంబచారుదేష్ణులాదిగాఁగలసకలయదువృష్ణిభోజాంధక కుమారులెల్ల మద్యపానపరవశులై నవ్వుచుఁ గేకిసలాడుచు నెఱిదప్పి హరిభ్రమోల మెలఁగుచుండిరి.

అప్పుడు సాత్యకి కృతవర్మనుజూచి యతండశ్వత్థామతో నిదుర వోవుచున్న పగతురఁ గూల్చిన యధర్మయుద్ధవిషయమై యందఱువినఁబలుక, నాభోజవీరుఁడు కోపించి, మాఱుగా సాత్యకి చేయి తెగిన సోమదత్తతనయుని భారతయుద్ధములోఁగూల్చిన నెఱిలేనికయ్యంబు తెఱంగునుగ్గడించెను. కృష్ణానుజుఁడదివిని దుర్వారక్రోధుఁడై కృతవర్మతలనఱికెను. భోజవీరులెల్ల సాత్యకిం జంపిరి. అందఱు నప్పటిపోరిలో నచ్చటిముసలాయుమానములైన తుంగలనాయుధములుగా నుపయోగించి యొండొరులపై వ్రేయుచుఁ గ్రుంగిరి. చావనివారినెల్ల వారిజోదరుఁడుతుంగ హతిచేఁ

గూల్చి, హస్తిపురిలోనున్న పార్థునకు యాదవప్రళయంబెఱింగిం చి యతనిం దోడ్తెరదారకుంబంచి,నిజాగ్రజునకు యదునాశంబు సెప్పి, స్త్రీజనంబులతో మగిడి పురంబునకు వచ్చెను.

(2) బలరామకృష్ణులు పరమపదవికిం జనుట.

యదుపుంగవుండు యాదవాంగనలంబురంబు సేర్చి తండ్రి యగువసుదేవునకుమ్రొక్కి "దేవా! తొల్లి కౌరవుల నాశము సూచితిని. నేఁడు యాదవక్షయము గంటిని. ఇష్టజనవిరహితుం డగు నాకింకవనంబులో నన్నమాడ్కినుండుట యొప్పును.మీరు చింతింపక నాకనుజ్ఞయిందు నరుఁడేతెంచి యెల్లపనులు సేయఁ గలఁడు. అతఁడే యాదవులకింక దిక్కగు" నని వీడ్కొని బల దేవుఁడున్న యెడకువచ్చెను.

అచ్యుతాగ్రజుఁడు తమ్ముఁడు సూచుచుండ యోగబలం బున శరీరమువిడిచి, యనంతమూర్తియందుఁ దనమూర్తిని గలపికొనియెను. కృష్ణుఁడును వనంబులో నేకాకియై సంచరిం చుచుఁ దనదివ్యచిత్తమునఁ దనయవతారకార్యములెల్లఁ దీఱుట తలపోసి, పరమపదవికిఁ జననెంచి, యొకమహీరుహము క్రింద భూస్థలిశయనించి యుండెను. అప్పుడచ్చటకు జరయను రాక్షసియోర్తువచ్చి, సమీపమునఁ దిరుగుచున్న యొకవేఁట కానికి మురారాతిశరీరముహరిణాకృతిగాఁగనఁబడునట్లు మాయ గావించిన, నన్నరాధముండు మాధవుని శ్రీపాదతలంబు దూరి మీఁగాలవెడలునట్లతిరయంబున నొక్కయమ్మేసి, డాసివచ్చి కనుంగొని, పరమపురుషుఁ డగుట యెఱిఁగి, పరమవిషాదభరి తుఁడై యతని చరణంబులపైఁ బడెను. మురారికిరాతు నూరార్చి, యొడలు దొఱఁగిపరమ పదవికిఁ జనియెను. బ్రహ్మాది

దేవత లెల్లనయ్యాది దేవుని యవతార కృత్యములెల్ల వాక్రుచ్చి పొగడిరి. అతండును వారల నెల్లసంభావించి, యనాదియు, నవ్యయంబును,నమలంబును నైన నిజపదస్థితుండై వెలింగెను.

**(3) అర్జునుడు మృతులగు యాదవుల కగ్నియిచ్చి ద్వారకావాసులఁ బంచవటిసేర్చుట.**

రాజేంద్రా ! అటఁ దారకుండు హస్తిపురికిఁజని ధర్మనందన ప్రముఖులకు యదునాశం బెఱింగించిన, నందఱు శోకవార్ధిలోమునింగిరి. అర్జునుఁడప్పుడేకదలి శీఘ్రప్రయాణంబుల, ననాధస్త్రీచాడ్పునఁ గన్పట్టు కృష్ణుఁడులేనిద్వారకసొచ్చి, తన్నుఁగానవచ్చి శోకవివశులైన యాదవభార్యల నూరార్చి, స్వజనక్షయదుఃఖితాత్ముఁడై యున్న వసుదేవునిం జూడఁబోయెను. ఆ రాజు దుఃఖించుచు నల్లునితో నిట్లనియె. "అనఘా ! మునుల శాపంబుచే మాూసలాహవమున యాదవులెల్ల నీల్గిరి. బలదేవవాసుదేవులు విపినగతులైరి. నాకును జీవితంబుపై నాసలేకున్నది. నేటికి నేఁడవదినమున నిప్పురమంబు రాశిలోమునుఁగుననియు,నీవిందులకేతెంచి పురజనులనెల్ల రక్షింపఁగలవనియు దామోదరుఁడు నాతోఁజెప్పి చనియెను. నీవుప్రాజ్ఞుఁడవు.కార్యవిదుండవు. ఎల్లపనులూ నీయందేనిల్చినది. కావున,

క. ఈవనితలఁబ్రజలను దం
తావళముఖవస్తువులను దగుచందమునన్
నీవరసి కొనుము బావా
శ్రీవిశ్రుతకృష్ణుపనుపు సెల్లింపవనా."

పార్థుఁడు మామతో ధర్మతనయుని తలంపుచొప్పన నింద్రప్రస్థపురమ్మున యాదవుల నిల్పుట కార్యమని యొఱింగించి, పురజనులనెల్ల రావించి వారితో

క. "వననిధి నేఁటికి నేడవు
దినమున నిప్పురముముంచు, దివిజులుగగనం
బుననుండి చెప్పఁగా నే
విని నదియిది వెడలవలయు, వేగమ మనకున్".

అని యందఱను బ్రయాణమునకు సిద్ధమైయుండు నట్లు చెప్పి, తానారాత్రి కృష్ణుని సదనంబున వసియించెను.

మఱునాఁడుదయమున వసుదేవుఁడు యోగబలముచేఁ దనువియోగ మొందెను. అర్జునుఁ డాతనికివలయు నగ్నికార్యములుదీర్చి, మధ్యాహ్న సమయమున యాదవ భామినులతో సముద్రతీరమునకుఁ జని, యందు నిర్గత ప్రాణులై పడియున్న సకల యదువృష్ణిభోజాంధక ప్రవరులకునెల్లఁ బితృమేధక్రియలు విప్రసహాయుఁడై నడపి, స్త్రీలను బురంబున కనిచి పుచ్చి,తగిన యనుచరులతో రామకృష్ణులం జూడ వనంబునకుఁబోయెను.

రాజేంద్రా! వినుము. దైవనియోగంబున నరుఁడు వనంబులో దెసతప్పి రామకృష్ణులం గానక యెందెందేనియుఁ దిరుగుచు, ద్వారక మున్నీటిలో మునుగు దినమునకుఁ దొలి యగు దినాంతమున నొక్కచోటఁ బోయచే వలనెఱిఁగి విగతజీవులై పడియున్న వాసుదేవ బలదేవులంగని వగచుచు, ననుచరులతోఁ గార్యాలోచన మునకుఁజొచ్చి, రుక్మిణీప్రముఖ కృష్ణప్రియాంగనలకును బలదేవుని భార్యలకును దమభర్తల నిర్యాణప్రకారమప్పటికిఁ దెలుపక, ముందుగాఁబురజనులనెల్ల సూర్యోదయమునకుఁ బూర్వము పురంబునుండి వెలువరించుట మొదటిపనిగా నిరూపించి, రామకృష్ణులకు నగ్నియిచ్చి, రయంబునఁబురంబుసొచ్చి, ప్రొద్దుపొడుపునకుముందే సకలజనులను వారివారికిఁ గల మోయఁగల సరకులతో నగరివెడలునట్లు చేసెను.

రాజేంద్రా! ఏమని చెప్పుదును? పురంబు వెడలిన జనులెల్ల సూర్యోదయ సమయమున నెమ్మనంబు లద్భుతరస మగ్నమై కనుఁగొనుచుండ, జలనిధిపొంగి ద్వారకాపురంబు ముంచెను. ఆజనములు తమలో వెక్కసమంది పల్కుచు నర్జున దర్శితమార్గులై పంచవటమున విడిసిరి.

## (4) అర్జునుఁడు చోరులచే భంగపడి వ్యాసునిచేఁ దెల్పఁబడుట.

కంసారిమఱదియట్లు తెఱవపిందును దక్కిన పురజనులను, బంచవటంబున విడియించియుండఁ గొందఱు వీరులైన చోరులా జనసమూహంబుగనుంగొని, వారియెడవిశేషధనముండుట యెఱింగి దానినపహరించు బుద్ధిగలవారై యొండొరులఁ బ్రోత్సహించుకొని,

క. బాలురు వృద్ధులుఁజుండీ
   యాలమునకుఁ గడఁగనొక్కఁడయినను లేఁడీ
   స్త్రీలంబొందువు దమనుచును
   నేలయవిసిమూఁగినట్లు నిర్భరభంగిన్.

చెలరేఁగి చేడియల సొమ్మపహరింపఁజొచ్చిన,విశ్వచ్చుఁడమ్మ్రుచ్చులం గ్రచ్చఱఁజంపనెంచి దివ్యాస్త్రము లేయనెంచెను. కాలవిరోధంబుచే నతనికి మంత్రములు స్ఫురింపఁవయ్యెను. కిరాతబలంబుఁ గూల్పనల్పములగు ప్రకృతిసాయకములు సాలునని వానిఁగొన్ని నేయ దొనలునురిత్తయయ్యెను. నగభేదిసుతుఁడు వగచుచు గాండివముచే నోపినభంగిఁగిరాతులతోఁచెనంగి, రుక్మిణియాదిగాఁగల కృష్ణునియగ్రమహిషులను, బలభద్రుని దేవులను, మఱియుఁగొన్ని యాదవసుదతులను

మాత్రము చోరులచేఁబడకుండరక్షించెను. తక్కినస్త్రీలనెల్ల ముచ్చులుపట్టుకొని చనిరి.

అర్జునుఁడు దైన్యమొందినవాఁడై యందఱితోఁ గురుక్షేత్రముసేరి, యాదవవంశంబును దగినచోట్లఁ బ్రతిష్ఠాపింపనెంచి, కృతవర్మ తనయుని వానిబంధువులతో మృత్తికావతి పురంబులోను సాత్యకి నందనుని సరస్వతి నగరములోను నిల్పునట్లుచేసి, తక్కినవారినెల్ల నింద్రప్రస్థముననునిచి వారి కెల్లరాజుగా వాసుదేవుని మనుమఁడైన వజ్రదేవుని రాజుగాఁ బట్టాభిషేక మొనరించెను.

యాదవ వంశోపకారియైన పాకారితనయుఁడంత హలధర దామోదరుల నిర్యాణ ప్రకారంబంతయు వారి భార్యలకుఁ జెప్పి, పురజన రక్షణం బవశ్యానుష్ఠేయ మగుటచేఁ దానంతకు ముందు వారి కవ్వార్త దెలుపమికిఁ దన్నుమన్నించునట్లు వేఁడుకొనెను. అక్కాంతలు కొంతేయు నూరార్చి కృష్ణవియోగ దుస్సహులై యగ్నిసొచ్చి కొందఱును, దపశ్చరణంబునఁ గొందఱును దనువియోగ మొందిరి.

పార్థుఁడంత ఖిన్నుఁడై చేరువనున్న వేదవ్యాస మహామునీంద్రుని యాశ్రమంబుసొచ్చి మహర్షిసత్తము చరణంబుల కెరగిన, నాతఁడాతని దీనభావముపలక్షించి కారణమడిగెను. నరుఁడు సంయమీంద్రునకు యాదవ మౌసలాహవ ప్రకారంబును, రామకృష్ణుల నిర్యాణంబును, గిరాతబలంబుచేఁ దనకైన భంగమును సవిస్తరముగాఁ దెల్పి దుఃఖించిన, నద్దివ్యజ్ఞాన ఘనుఁడు నరునకు శోకోపశమనములైన వాక్యములు సెప్పి యిట్లనియె.

క. "బలమును బుద్ధియుఁ జేవయు
నలఘుమతీయుల్లసిల్లు నగుకాలమునం
బొలియుంగాలవిపర్యయ
కలనంబునబుధులకుఁబ్బుఁ గలఁకయుఁగలవే."

కాల ప్రభావమెఱిఁగి శోకముడిగి నీవును నీసోదరులు నింక దేవ భావంబు నొందుఁడు."

నరుఁడు మునితిలకుని హిత భాషణలఁ గలంక దేఱి యతని చరణములకెరగి వీడ్కొని హస్తినాపురంబుసొచ్చి, తన పోయివచ్చిన తెఱంగంతయు సోదరులకుఁ దెలియఁజెప్పెను.

ఇది మౌసల పర్వకథాసంగ్రహము.



శ్రీ

శుభమస్తు

# బాలభారతము.

## XVII మహాప్రస్థానికపర్వము.

### (1) పాండవులు ద్రౌపదీ సహితులై మేరుపర్వతము సేరుట.

వైశంపాయనుఁడు జనమేజయున కిట్లనియె. "రాజోత్తమా! ధర్మపుత్రుఁడట్లు పార్థునిచే నిఖిల యాదవ మౌసలాహవప్రకారమును, యాదవ వంశప్రతిష్ఠాపన క్రమమును, మునీంద్రుఁడగు పారాశర్యుని హితభాషణంబు తెఱంగును విని, కాలప్రకారవేదియై, కర్మసంత్యాగమొనరించి స్వర్గమున కేగుట కార్యమగునని తమ్ములతో విచారించి, నీతండ్రియగు పరీక్షితునకుఁ గురురాజ్య పట్టాభిషేక మొనరించి, సుచరిత్రయు గురుకుల పవిత్రయునైన సుభద్రా దేవితో నిట్లనియె.

మ. భవదీయాత్మజు నాత్మజుండు కురుభూ
భారోద్వహుండయ్యె యా
దవవంశోత్తరుఁడైన వజ్రునకు నిం
ద్రప్రస్థరాజ్యంబు గా
రవదీప్తంబుగ నిచ్చినాఁడ, సుచరి
త్రా రక్షణీయంబులై

నవియీయిందులు రెండు, నీవుదృఢధై
ర్యంబొప్పరక్షింపుమీ.

అంత నా భూపతి సత్తముఁడు భారత మహాసలాహవ ములయందు నీల్గిన బంధువులకు ఎఱియు నూర్ధ్వలోకహితము పొందెడుదానాది బహువిధ పుణ్యకర్మను లాచరించి, ధౌమ్య కృపాచార్యులకు ధనకోటినిచ్చి పరితృప్తహృదయులం జేసి, పౌర జనుల యనుమతివడసి, తమ్ములు నల్వురును ద్రౌపదియు వెంటరా హస్తినాపురంబు నిర్గమించెను. అయ్యైవ్వురకు వెనుక నొక కుక్క విడువక చనుచుండెను.

పాండు పుత్రులంగనా సహితులై చనువారు, తమ వెంట వచ్చుచున్న పరీక్షిత్ప్రముఖ నిఖిల జనములను బురం బున కనిచిపుచ్చి, గంగాతీరంబు సేరి పూర్వాభిముఖులై సముద్ర తీరమునకు వచ్చిరి పార్థుఁడప్పుడు తన ధనుశ్శ్రేష్ఠమగు గాండీ వమును వనల దేవుని శాసనంబున మున్నీటిలోఁ బడవైచెను. అంత వారలకుఁ బ్రదక్షిణంబుగా నడచి దక్షిణపశ్చిమ సము ద్రములు సూచుచు, హిమాచలమెక్కి యందనేక గిరిసరిదర ణ్యమార్గములు యోగబలముచేఁ గడచుచు మేరువునకు సమీప ముగావచ్చిరి. వారి వెంటఁబడిపోవుచుండిన కుక్కురము ను విడు వక వారి వెనుకనే చనుచుండెను.

(౨) భీమాదులును ద్రౌపదియును నిర్జీవులైపడుట.

రాజేంద్రా! మేరుగిరి మార్గవర్తులై యందఱుఁ జను చుండ మొదట ద్రౌపదియుఁ దర్వాత వరుసగా సహదేవునకు లార్జునులును, యోగబలము చెడి పుడమిపై గత ప్రాణులై పడిరి.

భీమసేనుఁడన్నంగనుంగొని శుద్ధాత్ములును బుణ్యావర్తనులునైన పాంచాలియుఁ దమ్ములు నేలపడిరో కోయని విలపించియడుగ సర్వధర్మవేదియగు నారాజు బకారితో, నరునిదెసఁ బక్షపాతబుద్ధి గల్గుటచేఁ బాంచాలికిని, బుద్ధిమంతులు తనకంటె నెవ్వరు లేరని గర్వించుచుండుటచే సహదేవునకును, దన్నురూపములో మించువారులేరని భావించుటచే నకులునకును, విలువిద్య నేర్పునందుఁ దనకంటె నధికులు లేరని నెమ్మనంబులో గర్వించుచుండుటచేఁ బార్థునకును జావవలసివచ్చెనని చెప్పెను.

ధర్మజ భీమసేనులు కుక్కరము వెంటరాఁగొంత దవ్వరిగిన, నప్పుడు యోగశక్తియెడలి వడముడి పుడమిపైఁబడి "అన్నా! ఏల నేనిట్లుతి?"నని యడిగెను. ధర్మనందనుఁడాతనితో "నీవత్యశనుండవై బాహుబలంబున నెవ్వరిని మెచ్చక రజ్జులాడుచుండుదువు. కావున నీకీ గతియయ్యె" నని మృతుఁడైన సోదరునివంక చూడకయే ధైర్యసాహోదారుఁడై సారమేయంబు వెంటరాఁజనుచుండెను.

## (3) సారమేయాకృతితోనున్న ధర్మదేవతచే ధర్మరాజు సంభావింతుఁడై స్వర్గమెక్కుట.

పుణ్యచరిత్ర సంపదచే యోగబల మెడలక చనుచున్న యమసూనునకు దేవేంద్రుఁడప్పుడు ప్రత్యక్షమై, నిజవిమానము నెక్కి స్వర్గమునకు వచ్చునట్లు నృపవర్యునిఁ బ్రార్థించెను. అతండు సోదరభార్యా వియోగమునకైన సహింపఁగల్గెఁగాని, వారివలెనే తన్ననుగమించి చావకవచ్చుచున్న కుక్కపైఁగల దయాతిశయముచే, దానిమహిని విడిచిపెట్టి యేకాకియై యింద్రు

నితో నాకమునకుఁ బోవ సమ్మానింపఁడయ్యెను. పాకారి దానికి వెఱఁగంది "నీచపుఁ గుక్కకు స్వర్గమెట్లగు ?" నని ధర్మరాజు తోఁబల్కిన, నయ్యాశ్రిత వాత్సల్య ఘనుఁడు సురపతితోఁ

చ. "అనఘచరిత్రవిన్ముశర

ణాగతుఁ జేకొనకున్కి, శుద్ధమి

త్రునియెడఁ జేయుద్రోహము, వ

ధూటివధించుట, విప్రునర్థముం

గొనుట, యనంగఁగల్గునివి

గూడినపమంబగునాకుఁజూడ, భ

క్తునపరాధునిన్ విడుచు

దోషముతో నిదియోర్వనచ్చునే.'

యని దృఢనిశ్చయుఁడై కుక్కనెక్కటిసించి స్వర్గమెక్కనొల్లమి నెఱింగించెను.

అప్పుడు సారమేయాకృతినున్న ధర్మదేవత సంతసిల్లి కొడుకునకు నిజరూపంబుసూపి "పుత్రా! నీధర్మనిరతికిని,సచ్చరిత్రమునకును, నిర్మలబుద్ధికిని, సర్వభూత సమదర్శనత్వం బున కును దేవతలెల్లమెచ్చి నిన్నుఁజూడ వచ్చియున్నవారు. నీవింక నొండనక యీదివ్యస్యందనమెక్కి నాకమునకరుగు" మనియె. నారదమహర్షియు నప్పుడా రాజవర్యునిం జూడవచ్చి

ఉ "దానములందపంబులను దద్దయుఁ బేర్కలయట్టిపారలన్

మానవనాథులన్ వినమె మా సెఁదదీయయశంబు లెల్లనీ

మానితకీర్తికీర్తులు సమస్తజగంబులయందుఁ బర్వట,

న్మేనులతోడవారిటులు నేర్చిరె రానమరత్వసిద్ధికిన్."

అనియాతని గొనియాడెను."

ధర్మరాజంత దివ్యరథమెక్కి దేవమునిగణ పరివృతుఁడై స్వర్గమునకుఁబోయి, యందు మానుషభావంబు విడువనివాఁడు గనుక, తమ్ములను, ద్రౌపదిని, భారతరణమృతులైన చుట్టములనుజూడఁ గుతూహలము కలవాఁడై, పురుహూతునకు నిజ మనోభిప్రాయ మెఱింగించెను ''

ఇది మహాప్రస్థానికపర్వ కథాసంగ్రహము.

-----

శ్రీ

శుభమస్తు

# బాలభారతము.

## XVIII స్వర్గారోహణపర్వము.

---

### (1) ధర్మనందనుఁడు నరకములోనున్న బంధువులఁ జూచి దుఃఖించుట.

వైశంపాయనుఁడు జనమేజయున కిట్లనియె.

కౌరవేశ్వరా! అమరపురికేగిన యమనందనుఁడట్లు స్వజనంబులఁ జూడఁగోరి వృత్రారినడిగిన, నతఁడొక్క దూతం గనుంగొని "నీవీరాజవర్యునకు నతనిబంధువులంజూపు" మనిపంచెను. వాఁడును నారదాదులు గొందఱు వెంటరా నా రాజోత్తముని గొనిపోయి, ముందుగా నొక్కచో స్వర్గలోక సౌఖ్యావాప్తిఁ దనరుచున్న దుర్యోధనునింజూపెను. ధర్మతనయుఁడా పాపవృత్తునకు సద్గతి సమకూరినదానికి వగచుచు వానిఁజూడనొల్లక, కర్ణాదిసోదరులం జూపించునట్లు దేవదూతతోఁ బల్కెను. నారదుఁడు ధర్మసూనునితో ధర్మయుద్ధనిరతుఁడై రారాజుపుణ్యగతి వడసెననియు దానికై చింతించుటనర్హమనియు నెఱింగించి, యాతని నరకలోకమునకుఁ గొనిపోయెను.

రాజేంద్రా! రక్తకేశమాంసాస్థిమయంబును, దుర్గంధదూషితంబును, వాయసగృధ్రక్రిమికీటాది సంకులంబును

నగు నాసంకటంబగు ప్రదేశంబున ధర్మతనయుండుండ నోపక వెడలిపోవఁ జూచెను. అప్పుడయ్యెడ దురంతనారక పీడయను భవించుచుండిన భీమసేనాదులును, కర్ణుండును, ద్రౌపదియు, దృష్టద్యుమ్నాది పాంచాలురును, ప్రతివింద్యాది ద్రౌపదేయు లును ధర్మమూర్తియగు నారాజుం గని "మహాత్మా! వెడలి పోకుము. నీపుణ్యతనువుపైనుండి వీచుగాలి మాపై సోకనిమ్ము మేముకృతార్థులమగుదు" మని యాతనికిఁ దమ్మెఱింగించి దీన స్వరంబులోఁ బ్రార్థించిరి.

ధర్మరాజు తనప్రియ బంధువులకైన దుస్థితికిఁ దద్దయు వగచి, పాపాత్ముఁడగు దుర్యోధనునకు స్వర్గమును, ధర్మపరు లై యీాగకాలియంత పాపముసేయని తనప్రియసోదరాదులకు నరకమును గావించిన దేవేంద్రునిపైఁ గోపంబుగదిరి, స్వర్గము నకు మగుడనొల్లక నరకములోఁ దమ్ములతోడనే యుండనిశ్చ యించెను.

## (2) ధర్మరాజు స్వర్గస్థులైన బంధువులంజూచి సంతోషించుట.

ఇంద్రుఁడు తన దూతచే ధర్మనందనుని నిశ్చయమెఱిఁగి యతని ననునయింపనెంచి దేవతావరులతో నతనిపాలికివచ్చి యిట్లనియె. "రాజేంద్రా! నీవంటి మహాపుణ్యశాలికి నరక వాసమర్హమగునా ? దేవతలెల్ల నీవిచ్చటనుండుటకు శోకించె దరు. వేగముగా స్వర్గసుఖమనుభవింపరమ్ము. రాజనువానికి నరకము సూడవలయును గావున, నేనిందులకు నిన్నుఁబంపి తిని. మహాపుణ్యులు తొలితొలినరకంబు సూచి పిదప యశస్సు

నాకలోక సుఖముల ననుభవింతురు. అల్పపుణ్యులు ముందుస్వర్గమును దర్వాత నారక పీడయుఁబొందుదురు. నీవు తమ్ములకును గర్ణాదులకును వగవకుము. వారెల్లరు సద్గతులంబొందిరి. ఇది నరకముకాదు. మదీయమాయచేఁ గల్పితమైన నరకము. నీవింక శోకింపక యీ యాకాశగంగలోఁ గ్రుంకులిడి పుణ్యాపదవుల కరిగి సుఖింపుము"

రాజేంద్రా! ధర్ముఁడును నిజతనూజు నుచితవచనముల గారవించి వజ్రధరుని పంపుసేయునట్లు నియోగించిన, నారాజసత్తముఁడు వియత్తటినీ స్నానమాచరించి, మనుష్య భావము దొఱఁగి దేవత్వమొంది, పుణ్య శరీరుండును, రాగద్వేష శోకాది బహువికార రహిత మనస్కుండునునై, పొగలేని నిప్పుపోల్కి వెలుఁగుచు, దేవమునిగణపరివేష్టుఁడై దివి కేగెను. దేవేంద్రుఁడక్కడ రాజునకు భారత సంగ్రామపరిత్యక్త శరీరులై దేవాది భావంబులొందిన బంధుకోటిని, ద్రౌపదిని, ధృతరాష్ట్రగాంధారులను, గుంతీ మాద్రీసహితుఁడై యున్న పాండురాజును మఱియుఁదక్కంగల స్వజనులంజూప, నాతఁడు స్వర్గములో నందఱం గనుంగొని పరమానంద భరితుఁడై యుండెను.

## (3) శౌనకాదిమహామునుల వృత్తాంతము.

వైశంపాయన మునీంద్రునిచే సర్పయాగ సమయమున జనమేజయుఁడు భారతకథను సమగ్రముగావిని కృతార్థుండును బ్రమోదభరితుండునై మునిపతిచరణంబులకు మ్రొక్కి వీడుకొల్పి విప్రులకు ధనంబులిచ్చి యాగమును సుప్రయోగముగా నెరవేర్చి రాచపాడితప్పక పుడమియేలుచుండెను.

ఆమహీపతి సర్పయాగమును జూడవచ్చిన యుగ్రశ్రవసుఁడను సూతుఁడు, బహుపురాణవేది, వివిధకథాకథన కుశలుండు, వైశంపాయన ప్రవృత్త భారతకథను సాంతముగా నాలకించి, నైమిశారణ్యంబునకుఁజని యందనేకమునిగణ పరివృతుఁడై సత్రయాగమొనరించుచున్న శౌనకుండను కులపతి మొదలగుముని ముఖ్యులంగని నమస్కరించి "మునిసత్తములారా! నేను వ్యాసశిష్యుఁడైన రోమహర్షణునకుఁ బుట్టినవాఁడ. పెక్కుపుణ్యకథలుసెప్ప నేర్పరితనము నాకుఁగలదు. మీరునాచే నే కథవినవలతు?" రనియడిగిన, వారును సంతోషించి.

క. ఏయది హృద్యమపూర్వం
బేయది, యెద్దానివినిన నెఱుకసమగ్రం
బై యుండునఘనిబర్హణ
మేయది, యక్కథయవినగ నిష్టమునూకున్.

అని ప్రత్యుత్తర మిచ్చిరి.

ఉగ్రశ్రవసుండను కథకుండప్పుడా శౌనకాది మహామునీంద్రులకు వైశంపాయన కథితమహాభారతం బంతయు సాంతముగా వినిపించి, వారికీఁద త్ప్రభావంబెఱింగించువాఁడై యిట్లని యెను.

తే. అమలధర్మార్థకామ మోక్షములసఱచి
యొలయుతెరు వెద్దియును నిందుఁగలుగు నదియ
యొండెడలఁగల్గు, దీనలేకుండు చొప్పు
దక్కొకంటను లేదు వేదజ్ఞులార

క. ఆద్యంతంబును నీయన
వద్యకథ వినంగఁగనిన వారికిఁ బాయున్

సద్యంబ బ్రహ్మహత్యా
వద్యము మొదలైన పాపవర్గంబెల్లన్.

ఉ. భారతమర్థితో వినినభక్తిఁ బఠించిన
శ్రీయునాయువున్
భూరియశంబునున్ బ్రమదముం
దృఢవిద్యయుఁ గల్గు, వారికే.
కోరికలైన వేగ మొనఁగూడు,
సుపుత్రునిఁ గాంచుసద్వధూ
గౌరవ మొప్పఁగాఁ బడయుగర్భిణియున్
వరుసంగుమారియుం

ఇది స్వర్గారోహణపర్వకథాసంగ్రహము.

బాలభారతము

సంపూర్ణము.

శ్రీకృష్ణార్పణమస్తు.